# శాంతి చక్రవర్తి

## (శ్రీ బుద్ధ భగవానుడు)

 గేయమాల





రచయిత:

టి. ఓబుల నారాయణరెడ్డి

# ప్రస్తావన

1950 సంవత్సరమందు విధివశాత్తు నేను బొంబాయి నగరంబు పోయితిని. అందొక పుస్తక విక్రయశాలనందు Light of Asia అను ఇంగ్లీషు పుస్తకము కొంటిని. చదివితిని. మరిమరి ఆ పుస్తకాన్ని చదువు అభిలాష కల్గి చదివితిని. అందు బుద్ధమహాత్ముని కథాభాగము మొదటిదై యుండెను. ఆ కథా భాగము నాకు చాల నచ్చినది. ఆ గ్రంథకర్త సర్ ఎడ్విన్ ఆర్నాల్డు అను ఇంగ్లండు దేశీయుడు. ఆయన కవీంద్రుడే గాదు మరియు తత్త్వవేత్తకూడ.

ఆ మహాశయుడు 1856 సంవత్సరమున ఇంగ్లాండు నుండి మంచి యవ్వన ప్రాయములో మనదేశానికి వచ్చెను. పూనాలోని దక్కన్ కాలేజిలో ఆయన ప్రిన్సిపాల్‌గా చేరెను. అతడు మనదేశీయ సాహిత్య పండితులను మేధావులను కలసి సంస్కృతము మొదలగు మన భాషలను కష్టపడి నేర్చుకొని భారత రామయణాదులను ఇంగ్లీషులోనికి అనువదించెను. 1879 లో ఆయన బుద్ధుని గురించి వ్రాసిన ఇంగ్లీషు గ్రంథమే యీ Light of Asia. ఈ గ్రంధం పద్యభాగంలో ఆంగ్ల సాహిత్యంలో * యొక వున్నతస్థానము అలంకరించినది.

ఆ కాలపు ఇంగ్లండు వార్తాపత్రిక లెన్నియో లండన్ టైమ్సు, లండన్‌డైలీ, టెలిగ్రాఫ్ మొదలనేక పత్రికలు బహు గొప్పగా ఆ గంధాన్ని ప్రశంశించినవి. మన మహాత్మాగాంధి మరియు జవహర్‌లాల్ నెహ్రూలాదిగ ఆ గ్రంథ ఔన్నత్యాన్ని గురించి గొప్పగా పొగడిరి. ఆ గ్రంథంలో మొదటిభాగం బుద్ధదేవుని గురించియు రెండవ భాగం 'గీతాగోవిందం'. ఆ గ్రంథమంతయు పద్యభాగమై యున్నది.

బుద్ధుని గురించి పై సర్ ఎడ్విన్ ఆర్నాల్డు మహాశయుడిట్లు పద్యం ప్రారంభించెను. స్వర్గంలోని దేవతలు భూమండలంలోని సంఘవిద్రోహల గురించి ప్రజలు పడె బాధల గురించి చూచి "Buddha will go again to help the world" " yea ! "spake he "Now I go to help the world" This last of many times this for birth and death End hence for me and those who learn my law. I will go down among the Sakyas" అని దేవుడు ప్రకటించినట్లు తెల్పెను. శాక్యుల వంశంలో పుట్టెదనని దేవుని నిర్ణయం తెల్పెను.

---

* ఆ పుస్తకం ఇంగ్లాండులో 60 సార్లు, అమెరికాలో 80 సార్లు పునర్ముద్రణ చేయబడినది.

ఈ గ్రంథం 66 వ పేజీలో "He watched her feet and bent" The farewell of fond eyes unutterable upon her sleeping face still wet with tears And thrice around the bed in reverence" అని బుద్ధ మహాత్ముడు ఒక అర్ధరాత్రిలో తన భార్యను చూచి అడవులకు వెళ్ళిపోయిన ఘట్టాన్ని తెల్పియున్నాడు.

ఆ గ్రంథం చివరలో I took my refuge in thy law of good నీవే శరణ్యమని సర్ ఎడ్విన్ ఆర్నాల్డు మహాశయుడు బుద్ధుని కోరినట్లు వ్రాసుకున్నాడు.

కీ॥శే॥ సర్ ఎడ్విన్ ఆర్నాల్డ్ ఇంగ్లాండులోని తన వారికి For England; O our India ! as dear to me as she" భారతదేశం ఇంగ్లాండువలె తనకు ప్రియమైనదే అని ఆయన తెల్పుకున్నాడు. క్రీస్తు శకం 1904 మార్చి 24 వ తేదీన ఆ మహాశయుడు పరమపదించెను. పరదేశీయుడైనా, పరభాషాజ్ఞానియైనా మన దేశ గొప్పతనాన్ని తెలిసి కీర్తించిన ఆ ఘనునికి మనమెంతో ఋణపడి యున్నామనుటలో సందేహములేదు. ఆయనకివే నా జోహార్లు. ఆయన పుస్తకం లోని విశేషాల నిట తెలుపుటకు స్థలాభావం వలన తెలుప వీలుకాలేదని మనవి.

ఆ లైట్ ఆఫ్ ఏసియా గ్రంథం చదివి చదివి నా హృదయంలో బుద్ధ మహాత్ముని గురించి హత్తుకొనిపోయి యుండెను. మరి కొంతకాలానికి 1956 సం॥లో కీర్తిశేషులు శ్రీమాన్ కలచవీడు వెంకట రమణాచార్యులు గారిని నాకేదైనా చదువుకొనుటకు పుస్తకమిమ్మని కోరగా శ్రీ బుద్ధ పురాణ గ్రంథాన్ని యిచ్చెను. నేనంటే ఆయన కడు ప్రేమతో యుండెను. అందుకాయనకు నా జోహార్లర్పించుచున్నాను. ఆయన స్వాతంత్ర్య సమరయోధుడు. ఈయన శ్రీ దుగ్గిరాల బలరామక్రిష్ణయ్య ఇంచు మించు సమవయస్కులై యుందురు. నాకు పుస్తకముల చదువుటయన్న చాల అభిరుచి వున్నది. ఆయన స్వాతంత్ర్య సమరయోధుడు, మంచి భాషాజ్ఞానియై యుండెను. ఈ గ్రంథాన్ని కీర్తిశేషులు శ్రీ దుగ్గిరాల బలరామక్రిష్ణయ్యగారు 1927 లో అచ్చువేయించి యుండెను. ఆయన ఆంధ్ర రాష్ట్రంలోనే మంచి వక్త, స్వాతంత్ర్య సమరయోధుడు. ఈయన అనర్గళంగా రాజకీయ ఉపన్యాసము లిచ్చుచుండెను. 1948 లో తాడిపత్రిలో కూడ ఉపన్యసించెను . యన బౌద్ధ వాఙ్మయ కవిబ్రహ్మ యను బిరుదాంకి తుడై యుండెను. శ్రీమాన్ సర్వేపల్లి రాధాక్రిష్ణ పండితుడు మొదలుకొని రాష్ట్రం లోని పల పండితులీ గ్రంథ ప్రాశస్త్యాన్ని గురించి ప్రశంసించిరి.

నా యీ శాంతి చక్రవర్తి లేక బుద్ధ మహాత్మ గేయమాలను పై రెండు గ్రంథాలందున్న విశేషాల అన్ని ఘటనల గ్రహించిన విషయమే ఈ గ్రంథమని మనవి. శ్రీ బుద్ధ పురాణం పలుమారులు చదువగా నా అంతరంగమందు గేయ మాలగా బుద్ధ మహాత్ముని గురించి వ్రాయాలని 1956 లోనే ప్రథమంగా బోధింపబడింది. అట్లు కొన్ని ఘట్టములలోని గేయాలు మాత్రం అపుడు వ్రాసి యుంటిని. అవి ఈ గ్రంథమందు * ఈ గుర్తు గలవియై యున్నవి.

తర్వాత యిటీవల సంవత్సరంనుండి సంపూర్ణంగా శ్రీ బుద్ధ మహాత్ముని చరిత్ర సంక్షిప్తపరచి గేయాలుగా వ్రాయాలని మదిలో స్ఫురించెను. అట్లు ఈ గేయమాలను మహాత్ముని జీవిత అన్ని ఘట్టాలను ఇందుచేర్చి వ్రాసితిని

ఈనాటి రాజకీయ, సాంఘిక, ఆర్థిక, నైతిక, సామాజిక స్థితిగతులలో యిటువంటి జ్ఞానుల చరిత్రలెంతయో మనదేశంలో అవసరమని తెల్పపనిలేదు. సామాజిక సత్యధర్మాలు చాలవరకు నశించినవి. ప్రేమ దయా స్వభావాలు యెందును కనబడుటలేదు. ద్వేషాసూయాలు సంఘంలో ప్రబలిపోవుచున్నవి. అహింసాభావ మందెవరిలోయున్నదో అగుపడుటలేదు.

## ప్రసిద్ధ బౌద్ధ ధర్మసంస్థాపన

క్రీస్తుకు పూర్వం 662 సంవత్సరాల క్రిందట శ్రీ బుద్ధ మహాత్ముడు జన్మిం చెను. బుద్ధమహాత్ముని వంశము రఘు వంశమే. మరియు ఆయన తల్లి దండ్రుల వంశ చరిత్రలు చాల అమోఘ చరిత్రలు గలవి. ఆయన భగవ దవతారమే యని మన పూర్వులు ప్రకటించిరి. శ్రీ బుద్ధ జననానికి ముందు ప్రపంచ సర్వ మానవులు అనగా మన భరత ఖండముతో కలిపి అరాజక అల్లకల్లోల దుస్థితిలో యుండి పలు బాధలతో, దుఃఖముతో అశాంతిలో మునిగి దేవుని గురించి సుజనులు ప్రార్థనా వేదనలు సలుప భగవంతు డవతరించెనని మన పురాణ ములు తెల్పుచున్నవి.

శ్రీ బుద్ధభగవానుడు జన్మించి అనాటి అరాజక అన్యాయ అసత్య అధర్మా లను ఖండించి ముందున్న సత్యధర్మాలను మానవులకు బోధించెను. అట్లు నూతన సత్యధర్మాలతో నూతనశాంతి జీవనాన్ని స్థాపించెను. ఆయన అదే ధర్మపథంలో అహింస ప్రేమ, దయ, సత్యములు ప్రధాన గుణము లయ్యెను. ఆయన చూపిన అష్టాంగమార్గం. 1. సమ్యగ్దృష్టి 2. సమ్యక్సంకల్పము 3. సమ గ్వచనము 4. సమ్యక్కార్యము 5. సమ్యగ్జీవితము 6. సమ్యగ్వ్యాయామము 7. సమ్యక్స్మృతి 8. సమ్యగ్ధ్యానము. ఈ యెనిమిది సూత్రాల సమన్వయంతో జీవించు మార్గ మవలంభించిననే మానవజాతి మనుగడ సుగమమయుమగును.

ఆ మార్గంలో జీవించినవారు తప్పక నిర్వాణము చెందెదరని అనగా కైవల్యం పొందెదరని ఆయన ప్రకటించెను. ఆ ప్రబోధము మనదేశమునందే గాక మొత్తం ఆసియా ఖండమంతయు అన్ని దేశములలో వ్యాపించెను. మరియు యూరప్ ఖండమునకు గూడ బౌద్ధ ధర్మము వ్యాపించెను. బౌద్ధ ధర్మం పూర్వపు వేదకాలపు ఆర్య సత్యధర్మాలతో నిండియున్నదని నేడు మనం చూచు ఉపనిషత్తులు, భగవద్గీతా సారాలు తెల్పుచున్నవనుటలో సందియంలేదు. అంతెందుకు బైబిలు గ్రంధం చూచిన క్రీస్తు బోధనలలో చాల విధావాలు బౌద్ధధర్మాల గురించియే తెలుపుననుట అతిశయోక్తి కాదు. బౌద్ధ ధర్మము దురదృష్టవశాత్తు రానురాను క్షీణించి మాసిపోయినది.

1893 వ సంవత్సరంలో స్వామీ వివేకానంద అమెరికాలోని చికాగో నగరములో విశ్వమత మహాసభలో హిందూమతము గురించి గంభీర ఉపన్యాసం చేసెను. అందు బౌద్ధమతము లేనిదే హిందూమతం నేడు లేదని స్పష్టంగా ప్రకటించెను. దేశంలో బౌద్ధధర్మం, బౌద్ధ ఆలయాలును నశింపచేయబడినవి.

దురదృష్టవశాత్తు నేడు భరతఖండములో ఆ ప్రశస్తిని గుర్తించుట లేదు. అందుకే ఈనాడు దేశంలో అనేక అకృత్యాలు అలజడులు అనంత పాపకార్యాల యీసునసూయలతో అశాంతి అరాజకాల వలయంలో చిక్కియున్నది. నేడు దేశం రాజకీయ, ఆర్థిక నైతిక అవిద్యాది సంక్షోభ సుడిగుండంలోపడి అల్లాడుచున్నది.

ఎటుచూచినా హింసా ప్రవృత్తియే కనబడుచున్నది. ద్వేషం, అసూయ స్వార్థం అహంకారాల చర్యలే అగుపడుచున్నవి. దౌర్జన్యాలు, దోపిడీలు, హత్యలు మానభంగాలు ఎల్లెడలా మనదేశమందేగాక ప్రపంచ వ్యాప్తంగా ప్రబలియున్నవి. ముమ్ముందు మహాభయంకర క్రూర జన జీవన మేర్పడు ననుటలో సందియంలేదు.

కావ రాబోవు భయనక పరిస్థితుల నెదుర్కొని శాంతిజీవనం చేయవలయు నన్న శ్రీ బుద్ధ మహాత్ముని బోధనల మననంచేసి ధ్యానంచేసి అచరించుటలోనే శాంతియుత జీవనం చేయుటే నేటి మన కర్తవ్యమని మనవి. అట్లు పాటించమని యెల్లరకు శతకోటి వందనాల నర్పించుకొనుచున్నాను.

బుద్ధం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి

ఇట్లు,

టి. ఓబుళ నారాయణ రెడ్డి
గ్రంథకర్త

## ప్రధాన రాజపోషకులు

శ్రీ గౌరవనీయ జె. సి. దివాకరరెడ్డి గారు
(రోడ్లు భవనాల శాఖామాత్యులు)

## రాజపోషకులు

శ్రీ చల్లా ధృవకుమార్, కంట్రాక్టర్ (హైదరాబాద్.)
శ్రీ చల్లా కోదండరామ్ అడ్వకేటు, (హైదరాబాదు)
శ్రీ శ్రీనివాసప్రసాద్, (తాడిపతి.)

## పోషకులు

శ్రీ సి. కులశేఖరరెడ్డి Ex M.L.A (రాయలచెర్వు)
శ్రీ ఎ. పుల్లారెడ్డి (తాడిపత్రి)
శ్రీ ఓ. వీరారెడ్డి. (పాతపల్లె.)
శ్రీ మూగిరెడ్డిగారి నారాయణరెడ్డి (చిన్నపొలమడ)
శ్రీ శ్రీమన్నారాయణ ప్రసాద్ (తాడిపత్రి)
శ్రీ జి. ఓబుళప్ప. (తాడిపతి)
శ్రీ ఎ. జి. కేశవరెడ్డి (పుట్టపర్తి)
శ్రీ సుంకు సీతారామయ్యగుప్త (తాడిపత్రి)
శ్రీ భాగ్యలక్ష్మిరెడ్డి అడ్వకేటు (తాడిపత్రి)
శ్రీ గొర్తిపుల్లయ్య (చల్లవారిపల్లె)
శ్రీ ఓగేటి రంగనాయకులు (తాడిపత్రి)
శ్రీ టి. సి. నారాయణరెడ్డి (తాడిపత్రి)
శ్రీ గొంది కేశవ లక్ష్మినారాయణ (తాడిపత్రి)
శ్రీ విజయసింహరాజు (తాడిపత్రి)
శ్రీ జి. నాగరాజు (తాడిపత్రి)
రోటరీ క్లబ్ (తాడిపత్రి)
శ్రీ గొంట్ల రామలక్ష్మయ్య (తాడిపత్రి)
శ్రీ సదాశివయ్య (తాడిపత్రి)
శ్రీ కుల్లూరు వేంకటసుబ్బయ్య (తాడిపత్రి)
మండీ మర్చంట్స్ అసోషియేషన్ (తాడిపత్రి)
శ్రీ రమేష్‌బాబు (తాడిపత్రి)
క్లాత్ మర్చంట్స్ (అసోషియేషన్) (తాడిపత్రి)

## పుస్తకావిష్కరణ మహోత్సవ సహాయకులు

శ్రీ యస్. వి. రంగయ్య (తాడిపత్రి)
శ్రీ నగరూరు రంగయ్య (తాడిపత్రి)
శ్రీ నగరూరు పెద్దయ్య (తాడిపత్రి)
శ్రీ సరస్వతీ విద్యామందిర్ ట్రస్టుబోర్డు (తాడిపత్రి)
శ్రీ పి. చిన్నారాయణ (చిన్నపొలమడ)
శ్రీ పి. వెంకటనారాయణ (చిన్నపొలమడ)
శ్రీ తిరుమల పెద్దసుబ్బరాయుడు (చిన్నపొలమడ)
శ్రీ తిరుమల నడిపి సుబ్బరాయుడు
శ్రీ తిరుమల చిన్న సుబ్బరాయుడు

# నా గురుదేవుని వంశ వృక్షము

## రావులచెరువు. (అనంతపురం జిల్లా)

భీమరాజుగారి ఆదిరాజు

లక్ష్మమ్మ

| ఓబులరాజు | వెంకటేశంరాజు | శ్రీనివాసరాజు | నరసింహరాజు |
|---|---|---|---|
| లక్ష్మినారాయణమ్మ | | | |

శ్రీహరి ప్రసాద్

శ్రీనివాస ప్రసాద్

శ్రీమన్నారాయణ ప్రసాద్

ఇందిర

మురళీ కృష్ణ

రాధా కృష్ణ



# కృతి కర్త



**టి. ఓబుళ నారాయణరెడ్డి**

# అంకితం

శ్రీ గురుదేవా భీమరాజు వంశోద్భవా
శ్రీ ఆదిరాజు అమలశీలి లక్ష్మమ్మల
శ్రీకర ఆది సంతతివాడవై అనుంగు ముగ్గురు
శ్రేష్ఠులు తమ్ములు కలిగి విద్యాబుద్ధులతో
శ్రేయంబుగ సర్వుల మన్ననలు పొందితిరి సాత్వికులై
శ్రీమద్గురువరేణ్యులైతిరి మీ రుపాధ్యాయులై 1

ఓ జ్ఞాన విజ్ఞానరాజా
ఓ శాంతమూర్తి శ్రీ ఓబుళరాజా
ఒజ్జవై నాకు నేర్పితివి సాహిత్య చొరవ
ఒసంగితివి నాకు ఆంధ్ర సాహిత్యాభిరుచిని
ఒకింత నన్నాలకించి నను బ్రోవుమయా 2

ప్రాథమిక విద్యాబోధ గురువులెందరో వచ్చిరి
ప్రాథమిక పాఠశాలకు మా చిన్నపాలమడ గ్రామానికి
ప్రథమంబుగ వారందరికి నా వందనము లర్పింతు
ప్రకాశించితిరి మరి మీ రున్నతవిద్య నేర్పుటలో
ప్రముఖపాత్ర వహించి గురువులైతిరి నాకు మీరు 3

స్వతంత్ర సమర కాలంబులో మా వుపాధ్యాయులై
స్వేచ్ఛా స్వతంత్రాల ప్రాముఖ్య ప్రబోధములతో
స్వదేశమును ప్రేమించుమను సంబోధనతో
స్వరాజ్యమునకై పాటుబడుమను బోధనతో
స్వతంత్ర సమర దేశనాయకుడైన గాంధీ ధరించు
స్వచ్ఛమైన ఖాదీ టోపీని ధరించితివి గదయ్యా 4

శుచి శుభ్రములందు మీకు మీరే సాటి
అచిరకాలమందె అలరింపచేసితిరి
అందరు బాలబాలికల కారోగ్య విధులనేర్పి
ఆరోగ్యానందములతోనుండ నేర్పితివి
ఆయుస్సు పెంచుకొన నేర్పితివి ఆశీర్వదించి
ఆంగ్ల పాఠ్యపుస్తకాల చదివించి నేర్పించితిరి
అన్ని కళలందు ప్రవీణులైయుండి మీరు
అందరికి తగు శిక్షణాబోధ నొసంగి
అందెవరెట్లు ప్రవీణులో ఎరింగి మీరు
అందందు బాలబాలికల ప్రవీణులుగ చేయ
నిరంతర కృషిచేసి నిస్వార్థముగ పెద్ద చేసితిరి
నిజప్రేమ కరుణాంతరంగులై
నీ బిడ్డలవోలె విద్యల నేర్పితివి గదయ్యా 5

ఉన్నత పాఠశాల మమ్ముచేర్చ
ఉత్సుక ఔదార్యాలతో
వడివడిగ పాఠ్య భాగంబులనేర్పి
విడివిడిగ అన్ని పాఠ్యాంశాలనేర్పి
విజ్ఞాన మార్గాన మము పెంచి పెద్దచేసి
విఖ్యాతిచెందిన మేటి గురుబోధకుడవై
వికసింప చేసితివి మా మూఢమతిని 6

నేర్పితివి దైవ భయభక్తుల గురించి
నేర్పితివి పెద్దచిన్నల తారతమ్య ధర్మంబు
నేర్పించితిరి ఆధ్యాత్మిక బావనల గురించి
నేర్పించితిరి యోగాభ్యాస మార్గంబు కూడ
నేర్పించితిరి సంగీతమందభిరుచియు
నేర్పించితిరి ఆటపాటల శిక్షణ నిచ్చి
నేర్పించితిరి నాటకంబులాడు రీతిని
నేర్పించితిరి రాగమాలికలు పాడుటందు
నేర్పించితిరి నిష్ఠామయ బ్రహ్మచర్యంబుకూడ
నేర్పించితి రెన్నియో మీకు తెలిసి నన్ని విధులను 7

సచ్చరితులై బాలబాలికలుండవలె నటంచు
సద్వివేకులై మెలంగుటే ధర్మమటంచు
సర్వాంతర్యామియై దైవమున్నాడటంచు
సేవింపుడంటిరి సంకోచంబులేక 8

నేటి పిన్నలె రేపటి పెద్దలని
నేటి పిన్నలె భావిపౌరులని
నిఖిల ధర్మంబుల నేర్పి
నిండుగ మము జీవించ కోరితివి గదయ్యా 9

భాగవతంబులోని శ్రీకృష్ణుని దుడుకుల గురించి
భాగవతంబులోని శ్రీరామచరిత్రను
భాగవతంబులోని రుక్మిణీ కల్యాణంబు
భాగవతంబులోని గజేంద్ర మోక్షంబు
భాగ్యవంతమైన అమర కోశంబులనేర్పి
పాఠ్యభాగంబులవి కాకపోయినగాని
పఠియింప చేసితివి టీకాతాత్పర్యాలతో
కంఠాపాటంబు మాతో చేయించి
కఠినపద భావార్థంబుల నేర్పితివి గదయ్యా 10

భాషాజ్ఞానంబు పెరగ బోధించితివి
బహుశ్రమపడి మీరు మము శ్రమింపచేసితివి
ఇంతటి వానిగ ననుచేసితివి
ఎంతో ఋణపడియున్నాను మీకు
అంతరంగంబు మీపై బోధించె నాకు
అర్పించుకొనుచున్నాను యీ నా శాంతి చక్రవర్తి
అమలశ్రీ బుద్ధమహాత్ముని చరితంబు మీకు 11

సంసార విరక్తిచెంది వాన ప్రస్థంబున
సర్వేశ్వరనామ కీర్తనల జపించుచు
శేషజీవితంబు గడప నెంచితివా!
శేముషీదురంధరా ఆలుపిల్లల త్యజించి
శేషసర్వసౌభాగ్య జీవన సంచితంబు త్యజియించి
మీ డెబ్బది నాల్గవయేట వైరాగ్యము చెంది
మట్ట మధ్యాహ్నమని కూడ లెక్కించక
మానసిక పరివర్తనచెంది!!
కట్టు గుడ్డలతో
పట్టుదలతో ఇల్లు వెడలిపోతివా!!!
పరమ త్యాగమయా శ్రీ ఓబుళరాజా!
అంకితంబిచ్చుకొనుచున్నాను గురువర్యా
అందుకొనుమయ్యా శ్రీ ఓబుళరాజా
ఎందున్నావో ఎట్లున్నావో
ఏలుము నన్ను మీ కరుణా కటాక్ష దీవెనలతో
ఆశీర్వదించుము శాశ్వతానంద శాంతితోనుండ
అనుగ్రహించుమీ నా యీ రచనా గ్రంధంబు
అనంతరూపా గురుదేవా శ్రీ ఓబుళరాజా 12

మీ యేవురు పుత్రులు మరియు పుత్రిక
మిక్కిలి యోగ్యులై విద్యావిజ్ఞానంబుల బడసి
మీ పోలికలతో సుఖశాంతులతో రంజిల్ల
మీ రాశీర్వదించితిరి గదయ్యా గురురాజ శ్రీ ఓబుళరాజా 13



# పరిచయ వాక్యాలు

''శాంతి చక్రవర్తి'' అన్నది సార్థక నామము. ఈ గ్రంథమును వ్రాసిన శ్రీ టి. ఓబుళనారాయణరెడ్డి ఒకనాటి శిష్య వర్గములో నత్యంతాభిమానము చూఱకొన్నవాడు. ఈ గ్రంథకర్తకు గ్రంథమునందలి విషయమునకును సన్నిహిత బాంధవ్యము లుండుననుట నగ్న సత్యము. ఈ రచయిత నేడు వయసులో ఉత్తరార్థమున కాలిడినను పూర్వార్థమునందు నుండియు శాంతపరిణితి కట్టులు సాచు సాత్వికుడే. న్యాయము, ధర్మము నను పాద ద్వంద్వము పదిలముగా నూది నడచిన జీవన యాంత్రికుడె. అతని మనోవృత్తి కనుగుణమైన వృత్తియే అతని ననుగమించినది.

లైట్ అఫ్ ఏషియా అను ఆంగ్ల గ్రంథము నాతని నాకర్షించి రచనా మార్గమున చేదోడుగా నైనది. ఇందలి కథ బుద్ధ భగవానుని పరమార్థ సిద్ధికి చరిత్ర కారులు తేలికగా కేవలం బాలుర కనుకూలముగ రచియించినారు. ప్రధానమైన ప్రసిద్ధమైన కపిలవస్తు పురమున కా నామము కలిగిన హేతువు వారికి గోచరించలేదు. మరియు సిద్ధార్థుని తలిదండ్రుల వంశగాథలు అవగాహనమైనట్లు లేదు. ఈ రచయిత అట్టి రహస్యములను మన కందింప కలిగినాడు.

ఇక రచన జాతీయ గేయరూపమై లయబద్ధ పదజాలముతో మనసు నూయెల లూచు లాలిత్యము కలిగియున్నది. వినుటకు చదువుటకు నువ్విళ్ళూరించుచున్నది. ఇది కేవలము రచన మాత్రమేకాక కవితాలాస్య విన్యాస భాసురమైయున్నది. చదువులతో తపులు రవులించు రసమాధురీ ఝురియన దగినది.

నా మాటలన్నియు స్వభావోక్తులే యని అత్యుక్తులు కావని పఠితలు గ్రహింపగలరని విశ్వసించుచున్నాను.

ఈ కవి యితోధిక గ్రంథములు వెలువరించుట కాయురారోగ్య మేధా భాగ్యముల ననుగ్రహించుటకై ఆ చదువుల తల్లిని ప్రార్థించుచు ఇతని నాశీర్వదించుచున్నాను.

తాడిపత్రి.
16-8-93

విద్వాన్ జోస్యం జనార్దనశాస్త్రి
(రిటైర్డ్ తెలుగు పండితులు)
(''అభినవవేమన'' ''ఆర్ష విద్యాప్రవీణ'' బిరుదాంకితుడు)

# కృతజ్ఞతాభి వందనములు



నేను రచించిన 'శాంతి చక్రవర్తి అను గేయమాలను నా రెండవ గురువు గారైన పూజ్య జనార్దనశాస్త్రి గారికి చదివి వినిపించితిని. అందుకాయన మిక్కిలి సంతోషించెను. నాపై యున్న ఆయన వాత్సల్య విశ్వాసాలతో హైస్కూలునందు (తాడిపత్రి) అయనక్రింద 1945 నుండి 1948 వరకు తెలుగు పాఠ్యాంశాలను నేర్చుకున్నాను గనుక యీ పుస్తకమును గురించిన పరిచయ వాక్యాలు తెల్పి యున్నారు.

హైస్కూలునందు తెలుగు భాషా బోధనలో బాలబాలికల కమిత ఉత్సాహ ఆనందములతో వేసరిక పడక యెట్టి ప్రశ్నలడిగినా పిల్లల కమిత ప్రేమతో విశదీకరించి మాకు విసుగులేక బోధించెను. ఛందస్సుతో కవితా ధోరణి నాకు ఆయన నేర్పి సర్వ సందేహాలను తీర్చెను. హైస్కూలునందే నాకు కవితా ధోరణియలవడునట్లు చేసెను. చదువుకొనునపుడే 'హంపీయాత్ర' అను పద్యములను నేను వ్రాయగా ఆయన సరిదిద్దియుండెను. 1956 లో యీ గ్రంథములోని * యీ గుర్తు గల గేయములను వ్రాయగా ఆయన చాలా సంతోషించెను. బాల్యంనుండి నామీద ఆయనకు ఒక విధమైన ప్రత్యేక ప్రేమాభిమానములున్నవి. అందుకు నే నెంతయో ఆయనకు కృతజ్ఞుడను. ఆయన బోధనలతో నేనొక యున్నత ఆదర్శ జీవితము గడుపుచున్నాననుటలో అతిశయోక్తి లేదు.

ఆయన సహజ జీవనుడే గాక ఆర్య సత్య ధర్మ సాంప్రదాయాను గుణ్యంగా నిరాడంబరుడై జీవించుచున్నాడు. కాని పొగడ్తలకుబ్బిపోవుట ఆయనకు సరిపడదు. ఆయన నన్ను కరుణించి ఆశీర్వదించి నందుల కెంతయో కృతజ్ఞడనై జోహార్లు తెలుపుకుంటున్నాను.

గ్రంథకర్త



# ప్రార్థన

బాల్యమునందె వ్యామోహాది దుష్ట భావంబుల వీడె నెవరు
బాల్యమునందె సంసారంబు వీడె నెవరు
భారమైన సన్యాసధర్మంబాచరించె నెవరు
భోగభాగ్యంబు లశాశ్వితంబులనె నెవరు
భువిలోని దుఃఖమయ యీసునసూయల వీడె నెవరు
భువి ప్రాణులెల్ల తనవలె సమానమేయని తెల్పెనెవరు
భువనమందు సత్యధర్మాలే మనుజుని కాపాడునని తెల్పెనెవరు
భూరి సుజ్ఞాన మూర్తి యాబుద్ధదేవుడె 1

సిద్ధార్థ చరితంబు మనుజులెవ్వరేని మాపురేపు
సిద్ధ మనసున చదివిన వినిననుగాని
సిద్ధించు ప్రేమదయాగుణంబు లాదిగ
సమకూరు ధరలోన సర్వజన జీవరక్షణంబు
సమసిపోవు పాపకార్యాది దుష్కృతంబులెల్ల
సంసారజనుల దుఃఖరాశివాసి తొలగిపోవు 2

మహాత్మా బుద్ధదేవా మమ్మాదరించుము
మాలోని మదమత్సరాల నశించునట్లుచేసి
మరిమరి నీ శాంతిసత్యధర్మ మార్గాలతెల్పి
మానవ బుద్ధుల యీసునసూయలనుండి
మరల్చిపాలించు మీజగతిని శాంతి చక్రవర్తివై 3





మత్స్యః కూర్మ వరాహశ్చ నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ బౌద్ధః కల్కి రేవచః



# శాంతి చక్రవర్తి

## కపిలవస్తుపురి నిర్మాణము
## శ్రీ బుద్ధమహాత్ముని తండ్రి వంశావళి

శ్రీ రాజిత ముని పూజిత రఘువంశశాఖయె
శ్రీకర అయోధ్య నేలిన ఇక్ష్వాకు వంశశాఖయె
శ్రీరామచంద్రుని సూర్యవంశశాఖయె
శ్రీబుద్ధ మహాత్ముని శాక్యవంశమయ్యె 1

వినుడు తొల్లి దశరథుడేలిన అయోధ్యా నగరంబు
ఘన సుజాతుడను రఘువంశ విభుడేలుచుండ
తనభార్య కేవురు సుతులు మరి యేవురు పుత్రికలుండ
తన యంతఃపుర మందొక రూప లావణ్యవతి శాంతిమతి
అను పరిచారిక నుపపత్నిగా చేసికొనియుండె
కాననగునిట్లు రాజుల కెందరో భార్యలుండె పూర్వంబు 2

ఆ విధంబున నాతని కామెకు ఒక సుతుండు కల్గియుండె
ఆవిడ సుతునిపేరు కూడ శాంతుడని చెలువారె
ఆ విభుడొక నాడామెతో కేళీగృహంబున నుండి
ఆ వనితతో నీదగు సౌజన్య మెంతయో ప్రశంశనీయుంబని
అవశ్యంబు కోరుమొక కోర్కె నీ యభీష్టంబు తప్పక తీర్చెద ననియె 3

శాంతిమతి తన సుతునికే యువరాజ్యాభిషేకంబు చేయుడని
శాంతుని నీ పుత్రులేవురుండనీయ రిందు సుజాత విభుండయని
శాంతి లేకుండ అశాంతి రేపె నామె యంతఃపురంబెల్ల
శాంతిలేక సుజాతుడు తల్లడిల్లె చివర కొప్పుకొనె
శాంతచిత్తుడై తన మాట వ్యర్థంబు గాకుండ 4

అయోధ్య రాజగు సుజాతుని తనయులు ఉపూరుడు
అనఘుడు నిపూరుడు కరకుంతకుండు మరియు ఉల్కాముఖుండు
అగణిత సింహ హసుండను యేవురుండ వారినెల్ల
ఆ సుజాతుడు రాజ్యము నుండి వెంటనె వెడలిపొండని
ఆ కుమారులనెల్ల తన యాజ్ఞగా యాజ్ఞాపించె 5

అయోధ్య నేలిన సూర్యవంశజు లాడినమాట
అసత్యము గాకూడదన్న సత్యవాక్యపాలకులని
అంతకుముందేలిన దశరథుడుకూడ కైక కిచ్చిన
అప్పటి వరమెట్లు నిజమయ్యెనో యెల్లరు కాంచ లేద?
ఆనాటి రాజన్యుల కదియే యుక్తంబై యుండెనేమొ 6

పితృాజ్ఞా పరిపాలనా దురంధరులైన తనయు లేవురు
పవిత్ర జన్మభూమి నెడబాయ సంసిద్ధులై హిమాలయ
పర్వత ప్రాంతారణ్య భూములకరుగు రాకుమారుల వెంట
పలు ప్రజాసమూహంబులు కూడ వెంబడించె 7

రాజకుమారు లేవురు ఆ ప్రజా సముదాయంబుతో
రోహిణీ నదీతీరంబు వెంబడించి శకోట వనంబుచేరి
రమణీయ విశాలోన్నత వృక్షసంశోభిత మధ్యభాగంబుచేరి
రాగరంజిత కపిలముని ఆశ్రమంబుచేరి రానందమొంద 8

సమీప భూములనెల్ల యా ముని ఆశీర్వాద
సహాయంబున ఆక్రమించి నిర్మించి రొక గ్రామంబు
సకలాంబునే యా జనసంఖ్య పెరిగిపోవ
సంతసంబున యా నగరిని కపిలవస్తుపురి యనంబడె 9

శకోటవనంబున వశించిరి కాన శాక్యులైరి వారు
శాక్యులన వారి పరిభాషలో బహిష్కరింపబడిన వారనబడ
సుజాతుని సుతులు నా ప్రాంతమందిట్లనబడె
సుచరిత ఇక్ష్వాకు వంశమందుద్భవమే శాక్యవంశమయ్యె 10

ఆ సుజాతుని సుతుడైన ఉపూరుడు జ్యేష్ఠుడై ఆ పురిని
అనంతవ్యాప్తిచేయ పలు ప్రాంతాల ప్రజలను రావించి
ఆ కపిలవస్తు నగరిని విస్తరింప అవిరళ కృషిచేసి
అగ్రగామిగా వ్యాపారాభివృద్ధి నగరంబుగాచేసి పాలించె 11

ఆ యేపురిలో జ్యేష్ఠుండట్లు రాజ్యమేల
అతని తమ్ములు నల్గురు పాండవులవోలె
అనవరతము తోడైయుండ ప్రజారంజక
ఆనందడోలలూగ న్యాయపాలనంబు సాగె 12

కపిలముని కరుణాకటాక్ష ఆశీర్వాదంబులతో
కపిలవస్తుపురి అనతికాలమందె అభివృద్ధిచెందె
కరవు కాటకాలులేని సుభిక్షరాజ్యమయ్యె
కుబ్జదేశంబునుండి కుమయూనువరకు వ్యాపించె 13

ఉత్తరంబున హిమాలయ పర్వతంబులుండ
ఉదయాద్రివైపు మగధరాజ్యంబుండ
పశ్చిమంబున అయోధ్య వ్యాపించియుండె
ప్రబల లిచ్ఛవీరాజ్యంబు దక్షిణంబు నందుండె 14

అగ్రజుండైన వుపూరుని అనంతరంబు క్రమంబుగ
అతని తమ్ములు నుపురుడు కరకుంతకుండు
అనంతరంబు ఉల్కాముఖుడు మరియు సింహహనుండు
అగణిత పుత్ర పౌత్ర ప్రపౌత్రులు శాక్యరాజులేల
అనాటి పృథ్వీ పాలనలో శాక్యరాజ్యబు ప్రజ్వరిల్లె 15

శాక్యుల అంతిమ ఐదవ రాకుమారుండైన సింహహనునకు
శుభంబుగ నల్గురు నందనులు నొక కూతురుండె
శోభాయమాన శుద్ధోధనుండె అగ్రజుడైయుండ
శుభోధనుడు ధౌతోధనుడు మరియు అమృతోధనుం డనుంగుతమ్ములై
శుభాహ్వాయంబుగ అమితాదేవి సుతా తిలకంబయ్యె 16

శ్రీ సింహహస భూపాలుండు దేహమును వీడ
శ్రీ శుద్ధోధనుడు రాజగద్దియ నధిష్ఠించె
శుద్ధహృదయారవింద పవిత్రుడై రాజ్యమేల
శుద్ధోధన రాచరికమందె చీనాదేశ పాహియాన్
శ్రీలతో జనరంజక స్వర్ణయుగంబుగ నలరారెయటంచు ప్రకటించె 17

శ్రీ శుద్ధోధనుండు చక్రవర్తిగా యలరార
శ్రీమతి మాయాదేవి యను కోళ వంశీయ సుదతిని
వివాహమాడి ఆర్థిక ఆధ్యాత్మిక రాజకీయ
విశిష్ట ఔన్నత్య శిఖరాన పృథ్వీలో కీర్తిగాంచె 18

భారతదేశమందీ శాక్య రాజధాని కపిలవస్తుపురి
మరి నేడు కానరాదు సిద్ధార్థుని జన్మస్థలంబుకూడ
మరుగయ్యె లుంబినీ వనంబు నేడచట
మెరయుచున్న దచట భూయిలా గ్రామంబు
సిరుల కాశీ కుత్తరాన భూషిత అయోధ్య కీశాన్య మూలయందు 19

## శ్రీ బుద్ధదేవుని మాతృవంశావళి గురించి

శాక్య వంశజుడైన కరకుంతకుని కాలంబందు
శాక్య వంశోద్భవయగు నొక కన్యయుండె
శుష్కించిపోయె నామె కుష్ఠువ్యాధి పుండ్లతో
శూన్యంబయ్యె రోగవిముక్తి సిద్ధహస్తులైన వైద్యుల మందులతో
శోకించిరామెని గాంచి శాక్యరాజ వంశజులెల్ల 20

అనాడు కుష్ఠువ్యాధి యను మహాభయంకర రోగంబయ్యె
అందలి జనావళి అసహ్యించు హేయ భావమందుండ
ఆమెనొక యన్న యామెను సుదూర హిమవత్పర్వతాల
అంచునకొక రథంబులో నిడుకొనిపోయి
అందొక విశాల గుహయందామెను విడచి అందాహారము నుంచి
ఆ గుహకు మూతగా గుండు త్రోసి మట్టితో కప్పివేసి
ఆ శాక్యనందనుండు తిరిగివచ్చి రాజధాని చేరె. 21

వాయువు శూన్యంబైన యాగుహలో ఉష్ణము ప్రజ్వరిల్లి
విశేష ఉష్ణమువలన వాయువు జనించి
వాయు విశేష ఉష్ణమై విరుగుడయ్యె నా రోగమునకు
వేగంబుగ నా రోగము పటాపంచలై నామె తేరుకొనె
విశేష రూపలావణ్య తరుణ వయస్సుతో
విమల శరీర లావణ్య దేవాంగనవోలె 22

ఇట్లుండ నొకనాడు ఆకలితోయున్న వ్యాఘ్ర మొకటి
అటు గుహవైపు వెళ్ళి బంధనమైయున్నగుండును
పటుతరంబుగ గాండ్రించుచు గీరుచుండె
అటువైపు ఫలాన్వేషణకై కోలుడను రాజర్షి చనుచుండ
పట్టుదలతో యెందుకరచుచున్నదని అచటికేగ
అట్టె పారిపోయె నా వ్యాఘ్రరాజం బతని చూచి 23

కోలుడెవరో కాదు కాశీరాజైయుండి తపంబు చేయవచ్చె
కోలుడావనంబున ఫలాన్వేషణతో ఆశ్రమంబు వీడివచ్చికాంచె
కోమలిని సర్వాంగ సుందరిగా గుహయందున్న యా కన్యను
'కోమలీ నీ వెవ్వతె' వని ప్రశ్నింప 'స్వామీ నేనొక శాక్య క్షత్రియ కన్యను
కనరాని కుష్ఠురోగినిగా నుండ నన్ని గుహయందు మా అన్నలు
కఠినశిలా మనస్కులై నన్నుంచు వదలివెళ్ళిరి
కరిగిపోయెను నా వ్యాధి తిరిగి కమనీయ రూపుచెందితి
కరుణించి కటాక్షింపుము స్వామి నను యేలుకొనుము
కరుణాంతరంగా మృతప్రాయనగు నేను పునర్జన్మ నొందితి 24

కోలరాజర్షి నామె సౌందర్యమున కచ్చెరు వొంది మృదు మధుర
మాటల నాలకించి
కోరి చేయుచున్న తపంబుమాని వెంట నామె నిడుకొనిపోయె
కోమలిని తన ఆశ్రమానికి జ్ఞాన ధ్యాన మనసాదుల విసర్జించి
కలికితో గృహస్థాశ్రమంబున వశియించె ఆనందపరవశుడై 25

ఆశ్రమంబున జడధారి యావనితా సహచర్య సౌఖ్య
ఆస్వాదమునందున్మత్తుడై ఆమె సుస్నిగ్ధవీక్షణములందె
ఆశించిన మోక్షము గలదని ఆమెతో సాగించె సంసారంబు
అష్టాదశ పుత్రులంబడసి ఆ అడవిలో వశింపుచుండె 26

ఆ కోలుని పత్ని తనయా కుమారులకు విద్యా బుద్ధులు నేర్పించి
అందరికి యుక్త వయస్సు రాగ చేరబిలిచె నొకనాడు
'అన్నలార మీరు పవిత్ర క్షత్రియ వంశజులు
అమోఘ సుందర కపిలవస్తుపురికి పోయి మీరు
అజంతుడను మా తండ్రిని కలువుడు మాతులురగు
అస్మదీయ అన్నలను కలువుడు కోలుని తనయులమని
అందరికి తెలుపుడు మీ జీవనా విధులను వా రేర్పఱచి
ఆహ్లాదంబుగ మిమ్ము కాచెదరని తెల్పె 27

వారటుల కపిలవస్తు నగరంబు చేరి తమ తల్లి కథ తెలిపి
వాసికెక్కిన వారి తాతను చేరగ సంతసించె
వారిని తాతయు మేనమామలు చేరదీసి
వారత్యంత ప్రేమాదరంబున వారికి తగు
వాసరంబులు జీవనాధారముల కల్పించిరచట 28

అజంతునకు వారి తండ్రి కోలుడు జామాతయని
నిజసుత రోగ విముక్త యైనందులకును
రాజర్షి బంధుత్వమున కెంతయో ఆనందించి
అజంతుని పుత్రులు వారినెంతయో ప్రేమించిరి ఆదరించిరి 29

శాక్యులా ఋషి కుమారులైన పదునెనిమిది మందిని
ఒక్కొక్కరికొక గ్రామంబునిచ్చి అదుకొనగ
చక్కని భూమినిచ్చి వ్యవసాయంబు చేసికొనుడని
అక్కోల తనయుల కెంతయో చేసిరి సహాయంబు
అక్కజముగ నా కోల వంశమచట అభివృద్ధి గాంచె 30

సుభూతుడను శాక్య వంశీయ డొకండు
సుచరిత కౌలీయ వంశీకన్య నొకర్తెను వివాహమాడ
సుభూతునికి జనించిరి తొమ్మిదిమంది కుమార్తెలు
సుభాషిత జ్యేష్ఠ కన్యా శిరోమణియే మాయాదేవియై
సుభాహ్యయ జన్మయే మన శాంతి చక్రవర్తి బ్రోచె మాతయై 31

అందరిలో జ్యేష్ఠురాలె మాయాదేవి మరియు మహామాయ,
అతిమాయ, అనంతమాయ, చూలరాయ, కౌలసేవ,
అమల చరిత మహా ప్రజాపతి (గౌతమి) యాదిగనుండ
అమరి యుండిరి అతిలోక సుందరులై అక్కాలమందు 32

కపిలవస్తు నగరానికి సమీప గ్రామ మందె
కన్య మాయాదేవి తండ్రి సుభూతుడుండ
కప్పమాతనికే గ్రామీణులు కట్టుచుండ
క్రమంబుగ తొమ్మిదిమంది పేర్లు అట్లుండె 33

శాక్యసింహహను భూపాలుండు పరమ పదించగ
శాక్య శుద్ధోదన రాకుమారుండు జేష్ఠుడై నధిష్ఠించె
శాక్యవంశ రాజసింహాసనంబు
శోభిత సుభూతుని జ్యేష్ఠ పుత్రిక మాయాదేవిని
శుభంబుగ మరియు యామె చెల్లి మహాప్రజాపతిని*
శుభఘడియలందు పరిణయంబాడె వైభవంబుగ 34

---

* గౌతమియనికూడ యనపడినది

# శుద్ధోదన రాజ్యపాలన చేసిన విధానము

అనాదిగయున్న నిరంకుశ స్వార్థమయ పాలనగాక
ఆ శాక్య విభుడు శుద్ధోదనుండు ప్రజాహితంబుకై
ఆ పాలన శాసనా నిర్మాణంబు దండనా విధానంబు
అందలి ప్రజాప్రతినిధు లాధీనమై యొప్పునట్లు చేసె
ఆ ప్రభువు యక్కాల మందలియొక ప్రజాప్రతినిధిగా యుండె
ఆ రాజపదవి వంశానుగతమై యున్నకూడ 35

సజ్జన శుద్ధోదనుండు తన కిరు పార్శ్వంబులందు
సర్వశేముషీ దురంధరులైన విద్యాధికులైన ప్రజాప్రతినిధులతో
సింహాసనంబు నధిష్టించి యువకులను వృద్ధులను
సుజన స్త్రీలను దరిచేర్చుకొని రాజకీయ విషయాలను
సంభాషించుచుండె ప్రధాన నగర కపిలవస్తుపురంబునందు
సంథావారమని పిలువబడు నొక ఆలోచనా మందిరములో
సర్వులకు సమానాధికారములిచ్చి చర్చించుచుండె 36

తన రాజ్యంబులోని ప్రతి నగరంబులోన
తప్పక నొక ఆలోచనా మందిరంబు వెలసియుండె
తమ తమ సమస్యాభియోగంబుల నివేదించుకొన
తరచుగ పంచాయితీలు సలిపి ప్రజాహితంబుగ
తగురీతిగ స్వేచ్ఛాయుత తీర్పులిచ్చి పాలించె 37

శాక్యరాజ్య పంచాయితీలందు సంకుచితంబులేక
హక్కులందరికి సమానముగనుండె
పెక్కుసమస్య లాయా గ్రామీణ నగర సంథాగారంబులందు
ఎక్కువగా పరిష్కరింపబడుచుండె న్యాయ సత్యంబులై 38

న్యాయ తత్త్వంబు యీశ్వరీయాంశ ప్రపూరితంబై
న్యాయ తత్త్వంబు సత్య ధర్మంబులై
న్యాయ తత్త్వంబు ద్వేషమత్సరాదులు లేక
న్యాయ తత్త్వంబు చెలంగె నక్కాలమందు సర్వులు సుఖించంగ 39

ప్రజలకు నిర్బంధములేని పాలనయైయుండె
ప్రబోధ విధంబున నుండె విద్యయు
ప్రభుపాలన పీడనలేకయుండె
పశుబలంబులేని రాజనీతియైయుండె
పాలన శాంతిభద్రతలతో యుండి
పరపీడనలేని రాజ్యపాలనయుండె 40

స్వార్థమయ జీవితంబు నికృష్టమనియు
సాధుజీవితంబు సర్వసమ్మతంబని నమ్మి
సర్వులు భౌతికంబునకే ప్రాధాన్యతలేని జీవనులై
సర్వేశ్వరానుగ్రహ ఆత్మానాత్మ జ్ఞానాంచిత
సాధువర్తనులైన జనజీవనంబుసాగె 41

శాక్యులు రాజులైనా హలంబుల స్వహస్తాలబట్టి
శ్రేష్ఠంబుగ చేసిరి వ్యవసాయంబు పశుసంపదతో
శాక్యవంశజులు 'కృషితో నాస్తి దుర్భిక్షమ్మ'ని
శాక్యులు పంటలకై దైవప్రార్థనల్ చేసిరి చేతులెత్తి 42

తమకు కావలసిన ప్రతిపంటలు వేసికొని
తమకు వలయు గుడ్డలకై రాట్నము వడికిరి
తామె వస్త్ర నిర్మాణ కృషిచేసి
తక్కువలేకుండ ధరించిరి పలురకాలుగ
తమకేకొఱతలేని పరిపూర్ణ వస్త్రధారులై 43

సంపదలన్నింట వృక్షసంపద శ్రేష్ఠంబుగనుండె
సర్వులు గ్రామబీడులందు నదీ తీరంబులందు
సర్వవిధ మొక్కలు చెట్లు నాటి పెంచిరి
సర్వజన సంక్షేమంబు నేలలాడ 44

శుద్ధోదన భూపాల పాలనలో విస్తరించె రాజ్యంబు
అధమునికైనా అన్యాయంబు జరుగుచుండలేదు
అధర్మమెందునా కానరాదయ్యె రాజ్యంబులోన
శుద్ధోదనుని భార్యలిర్వురు మెలగిరి పతిభక్తితోడ 45

భార్యలిరువురు దైవభక్తితో చేసిరి ప్రార్ధనలు
భయభక్తులుగల సద్గృహిణియై గౌతమి చెలువారె
భర్తృసేవలో తేలియాడె మాయాదేవి పట్టమహిషియై
భూపాలు డానందపారవశ్యుడై ఏలోటులేక వశించె 46

ఆరాజు ఇట్లుండ సంతతిలేక ఖిన్నుడైచేసె
అనన్య ప్రార్థనల్ సర్వదేవతలకు ధర్మయుక్త పూజలుచేసె
ఆయన భార్యలు సల్పిరెన్నియో ఉపవాస వ్రతంబులాదిగ
అన్నివేళల వేడిరి పరమేశ్వరుని సంతాన మొసంగ 47

భగవత్కృపాభిక్షకై చేయిచాచి రాజు ప్రార్థించె
భోగభాగ్యములేల రాజ్యంబేల సంతతి లేనిదె యని
భక్తి ప్రపత్తులతో నిరంతరంబుగ
భార్యలు భూపాలుడు దీనులై వేడిరి
భజనలతో దివారాత్రంబు లందును
భోజనంబు సైతముమాని వేడిరెంతో కాలంబు
''భక్తులమగు మాపై ద్వేషమెందుకు ప్రభూ"యు
భరించలేక వేడిరి భార జీవనంబుతో 48

ఒకనాటి రాత్రి మాయాదేవి చెలికత్తెల నడుమ
ఒకింత దీనవదనయై పరుండె చింతతో
ఒక తారక గగనంబునుండి దిగె భువికి
ఒక శ్వేతగజంబై తన యింట ప్రవేశించి
ఒక జామున మాయాదేవి యుదరంబు చేరె
ఒకింత జలదరించి లేచితలచె నది స్వప్నంబని 49

మాయాదేవి ప్రభాతంబుననే మహరాజునకా స్వప్న
మయరీతిని ఉత్సాహంబున తెల్ప
మనంబున రాజునుత్సాహియై తన పురోహితులపిల్చి
''మాననీయులారా యీ స్వప్నఫలంబేమిటి తెల్పు" డనియె 50

పురోహితులా స్వప్న ఫలంబు శ్రేయంబౌనని
ధరణీ తలంబంతయు నేలు పుత్రుండు కలుగు
పరమాత్ముని బోలిన సుతుడు కల్గు మీకని
పరిపరి విధముగ పొగడి చేకొనిరి కానుకల
పలుదాన ధర్మాల చేకొనిరి రాజు చేత 51

తన ప్రధానామాత్యుని రాజు పిలిచి
తనకు పుట్టబోవు తనయుని గురించి యడుగ
తప్పక తనయుడు పూజ్యుడై వెలుగొందు మరియు
''తెలియుచున్నదాబాలుండు విశ్వప్రేమికుడౌనని ప్రభూ 52

''ధరణీ తలంబున నిట్టివారు జనించి యుండలేదు
దేవాంశ సంభూతుడా బాలుండు ప్రభూ
ధర్మగృహస్థాశ్రమంబు స్వీకరించినచో
ధైర్య స్థయిర్య లోకోత్తర విరాజితుండై సార్వభౌముండగు
దైవయోగంబున నాతడు సంసారంబు బాసిన
ధరణిలో శాంతిని స్థాపించు శాంతి చక్రవర్తియై" 53

"ధర్మ సంస్థాపనాచార్యుడైశాంతి సౌఖ్యాల భువిలో స్థాపించు
ధర్మనిరతుడై కరుణామయుడై స్థాపించు ఆచంద్ర తారార్కంబుగ
ధర్మసత్యాలు నాలుగు పాదాల నిలుచు భువిలో
ధర్మ సంస్థాపనచేసి భువిలో వెలుగు శాంతి చక్రవర్తియై 54

అనంత అన్యాయ దుర్మార్గాలతో నిండియున్న యీ భువిని
అహంకారాది యీసునసూయల పారద్రోలి
అజరామర శాంతి సౌఖ్యంబు పుడమిలో వర్ధిల్ల
అమ్మహాత్ముడు ధరణిలో ప్రచారంబు చేయు
అనన్య సర్వసమానత్వ సత్య ప్రేమాంచిత
అగణిత ప్రాణి రక్షకుడై నూతన సమాజ స్థాపకుండౌను 55

బుద్ధమహాత్ముని జననానికి ముందున్న మిగతా ప్రపంచ
మానవ ప్రాణికోటియున్న తీరు యిట్లుండెను.



మానవ సంఘంబు మహాత్ముని జన్మకు ముందు
మహా ఘోర హింసల కిరాతక చర్యాల నుండె
మత బోధకులు పరమత ద్వేషులై
సుమతలు కరుణలు మహిలో మాయమయ్యె 56

నిరంతర పోరుల, యుద్ధములతో నిండిపోయె
నఖిల జగమంతయు ఘోర హత్యలతో
నరనారీ శీల భంగముతో దోపిడీలతో
నింగికెగసె హాహాకారాల రోదనలు 57

రాజులే రాక్షసులై ప్రజలను దోచుచు
రాక్షసపాలనయై రక్షణలేదు జనులకు
రోగ జార చోర భయకంపితమయ్యె
రాజ్యములన్నియు అల్లకల్లోల అరాజకమయ్యె 58

దద్దరిల్లెను విశ్వ మానవజాతి
దరిదాపులేని దౌర్భాగ్య పాలనతో జనులు
దిక్కులేదయ్యె యెటు చూచినా యనుచు
దిగులుచెంది నింగివైపు తలలెత్తి వేడిరి 59

దీనులై చేతులెత్తి యేడ్చిరి కన్నీరు మున్నీరై
భరతఖండంబందును హత్యలు దోపిడీల
భయోత్పాతంబులు ప్రజ్వరిల్లె
భక్తి జ్ఞాన మార్గంబు లదృశ్యమయ్యె
భగభగమండెను కులమత ద్వేషాలు 60

పుణ్య బ్రాహ్మణులని సంఘంబులో
పాపశూద్రులని విభజింపబడె
పుణ్య బ్రాహ్మణులు దేవుని ముఖమునుండి
పూజ్యదేవుని బాహువులనుండి క్షత్రియులును
సర్వేశ్వరుని ఉరువులనుండి వైశ్యులును
సర్వేశ్వరుని పాదములనుండి శూద్రులును
సృష్టి జరిగెనను దురహంకార బోధనలు ప్రబలె
సర్వులు గుణ కర్మ విభాగ మనుసరించియే 61
సర్వజన జీవితంబు సాగుచున్నదని

ఆనాటి బ్రాహ్మణ బోధకులు పండితులు
అజ్ఞానముచే యెరుంగలేక
అల్లకల్లోల అరాజక దుర్గతి సృజింపబడె
ఆ యజుర్వేద ముందున్న గతిని వక్రీకరించి 62

కర్మకాండ హింసాకాండమై ప్రబలిపోయె
కర్మజీవులు శూరులై విద్యాదూరులై
క్రూరవృత్తుల నవలంభించి పశుతుల్యులై
క్రూరపాపులై సాగించిరి జీవనంబు 64

బ్రాహ్మణులధికులమని యజ్ఞయాగాది
బ్రహ్మండ క్రతువుల జంతు పసికూనల చంపి
సాధుజీవము లెన్నియో బలిగావించి తృప్తిచెందుచు
సర్వులకన్న భువిలో మేమే యధికులమని
సర్వజనములపై పెత్తనాధికారము మాదేనని
సర్వులుండవలెనని తెల్పిరి తమ యదుపాజ్ఞలందని 64

మద్యమాంసంబుల మనసార సేవించి
మద్యమాంసపిండాల దేవతలముందుంచి
మహాభయంకర పాపమయ కార్యాలమునింగి
మేము తెల్పునదే మేము చేయునదే ధర్మంబని
మేము చేయునదే దైవహితంబని పల్కె నా కుటిల విప్రజాతి 65

సర్వేశ్వరుని పేర భక్తి పూజలటంచు
సర్వజనసంఘ విద్రోహ ఘోరహింసలు ప్రబలె
ఆర్య బ్రాహ్మణ జన సంచయంబు పేర
అసలు బ్రహ్మజ్ఞానంబు తెలియని బ్రాహ్మణుల చేత 66

శౌచము సత్యము దయయు అహింసా కారుణ్య మైత్రి
శూన్యమైపోయె సదాచార సంఘ జీవనంబు
శూన్యమయ్యె ఆధ్యాత్మికా ధ్యానశ్రద్ధలు నశించె
శూన్యమయ్యె సత్యధర్మ జనజీవనంబు 67

దుష్టభావములెల్ల పాలకులందు పెరిగిపోయె
ద్వేషాది మత్సర పాలన మతిశయించె
దుర్మార్గ మన్నివిధాల ప్రజలందు పెరిగిపోయె
దుష్టులకే జీవనంబు సార్థకంబయ్యె 68

బోధకులే పరమత ద్వేషులైరి
బాధింపబడిరి దోపిడీలతో పాలకుల చేత
రాజులే రాక్షసులై ప్రజలను పీడించ
రగిలె దుఃఖజ్వాలలు సుదతుల కండ్లనుండి
సుదతుల శీలంబు మంట కలియ
సుజన బ్రతుకులు లజ్జపాలయ్యె 69

నర నారీమణులు భ్రష్టులై
నరకయాతనల జిక్కి కడుదీనులై
దిగులుచెంది దిక్కులేదా మాకటంచు
దీనులై నింగివైపుచూచి చేతులెత్తి
'దేవుడున్నాడందురు వున్నాడా'యటంచు
'దిక్కు నీవే కావుమయ్యా శరణు శరణు' 70

అట్లు నేలనుండి నింగికే వినబడునట్లు
అనంతశోక కంఠాలతో
ఆకాశంవైపు యెలుగెత్తి
అఖిల జనావళి అమాంతం
అహర్నిశల పరితపించ 71

పృథ్వికూడి భరత ఖండంబు నలుదెసలు చూడసాగె
ప్రచండ వైపరీత్యాలతో భువి గడగడ వణకసాగె
ప్రపంచ ప్రజాక్షోభ నింగికెగయ
ప్రశాంత స్వర్గంబు దద్దరిల్లె 72

స్వర్గంలోని దేవతల కీ క్షోభ హాహాకారాల
సర్వమానవ శోకతప్త వేడి మంటలు
స్వర్గంలోని దేవతలకు తాక
స్వర్గ మల్లకల్లోలమై దేవతలు పరుగులిడిరి
స్వర్గాధిపు చెంతకు విష్ణుదేవుని కడకు 73

దేవతలు వేడిరి భూమండల క్షోభగురించి
దేవతలు వేడిరి భూలోక అశాంతి గూర్చి
" పాహిమాం పాహిమాం కావుమటంచు
ప్రభూ భువిలో శాంతి నెలకొల్పుము
ప్రభూ కరుణించి భువిని కాపాడలెమ్ము" 74

విష్ణుదేవుండు విస్మయుడై నడిగె
వినయంబుగా అర్ధనిమీళిత నేత్రుడై
'వివరింపుడు మీ భయాంధోళన కారణంబు'
'విశ్వరూపా చూడుము భూమండలయా తనలు
విశ్వరూపా భరతఖండ దీనజనుల కావు' మన
విష్ణువు భువిపై సారించి చూచి
విస్మయుడై కరుణా మయుడయ్యె 75

"నేను భువిలో అవతరించెద
నేను శాక్యవంశోద్భవుడనయ్యెద
నేను భువిలో ధర్మసంస్థాపన చేసెద
నేను భువిలో శాంతి నెలకొల్పెద
నిశ్చింతగా నమ్ముడు దేవతలారా" యనియె 76

భగవానుడు తెల్పినట్లు ఇచట గీతా వాక్యము యిట్లు సార్థకమైనదని గీతావాక్యము తెల్పుచున్నది

''యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాప నార్థాయ సంభవామి యుగేయుగే''

అనగా ధర్మ సంస్థాపన కొఱకు దుష్ట శిక్షణ శిష్టరక్షణ కొరకు ఆయా కాలాలందు యుగయుగాన తాను జన్మించి భువిలో సత్య ధర్మాలను మరియు శాంతిని భగవంతుడు తప్పక నెల కొల్పెదనని ప్రకటించియున్నాడని మనకు విశదమగుచున్నది

అందుకే మాయాదేవి గర్భము ధరించకారణ మైనదని మనం గ్రహించ వలసియున్నది దేవదేవుడు జన్మించుటకై అకాల మాసన్నమైనదని ఇచట గ్రహించ వలసియున్నది. అదియే శాంతి చక్రవర్తి అవతరణాక్రమము (బుద్ధావతారక్రమము)

మాయాదేవి స్వప్నకథ రాజ్యం బంతయు తెలిసె
మహా సంరంభముతో కపిలవస్తుపురి కళకళలాడె
మహరాజు భార్య గర్భము ధరించి నిండు చూలాలయ్యె
మహదానందంతో రాజు చేసె పలు దాన ధర్మాలు 78

రాణి ఆచారంబుగ పితృగృహంబున ప్రసవించ తలచి
రాజునడుగ ప్రయాణ సన్నద్ధము లందుకు చేసె
రాజ దాసదాసీ జనంబుల మధ్య మాయదేవి
రంగవైభవంబుగా నడచుచూ సాంద్రారణ్యంబు చేరె 79

అవనలక్ష్మి ఋతురాజిత స్వాగతంబు పలికె
ఆశోభ కాంతులకు చిత్తమున్మత్తత కల్గించుచుండె
భూరుహశాఖోపవిష్ఠ విహంగ బృందాలరవళులతో
భూషిత పుష్ప గుచ్ఛములతో పరవశించు తుమ్మెదలతో 80

మహదానంద వింతలు కొల్పు శోభతో
మనోహర దృశ్య మార్గంబున చనుచుండె
రాజభటుల సందడిమధ్య వసంత ఋతువునందు
రంగురంగుల పుష్ప చిగుళ్ళ వృక్షలతలతో
రకరకాల పండ్లగుత్తుల వృక్షలతలతో
రంగరించిన పుష్పఫలగుభాళింపుతో
రమణి మాయాదేవి చనుచుండె వసంతశోభలో 81

నూతన ప్రపంచ మవతరించెనా
నూతనోత్తేజ సూర్యోదయంబయ్యెనా యను
నూతన కాంతిలో యా యడవిలో చునుచుండ
నూతన బడలిక మరియు నొప్పులు సోకె నామెకు
నోములపంట యామెకు పండ సమయంబయ్యె 82

ఆకులలములు మెత్తగ ఒక వట వృక్షము క్రింద
ఆపరిచారికలు యెత్తుగ పరచి
ఆమె నందుపై పరుండబెట్టిరి సేదదీర్చ
ఆ దాసదాసీ జనంబు మధ్య రాణివశించె
ఆ రాత్రి యందావనమె వారి విడిదియయ్యె
అదియే పవిత్ర లుంబినీ వనంబై
అవతరించెనందె ప్రపంచశాంతి చక్రవర్తియై
అందే జన్మించెదేవుడు బుద్ధ మహాత్ముయై 83

ప్రాతఃకాలంబున సూర్యోదయ సమయంబున
ప్రసవ వేదనంబు కలుగ దాసదాసీ జనంబు కలవరపడి
ప్రమాదకర భయంకరాటవిలో చిక్కియుంటిమెట్లాయని
ప్రభురాజధాని కడు దూరంబుగ నున్నదేయని చింతించిరెల్ల 84

విధిపై భారమువేసి ప్రార్థించిరి విశ్వేశ్వరుని
వినమ్రులై దేవిశయ్యను చుట్టిముట్టి
వినోదంబుగ ప్రసవించె మాయాదేవికి పెద్దనొప్పులు లేకనె
విశ్వేశ్వరుడే ప్రభవించె జనియించె శాంతిచక్రవర్తియై 85

ఇక వెనుదిరిగె యా మాయాదేవి దాసీ జనంబుతో
ఇక ఘోరారణ్య ప్రయాణము మాని రాజసౌధంబుచేర
భర్తృగని సంతసించునట్లు వచ్చిచేరె
బాగ్యంబుకన్న మిన్నయైన కుమారునితో
భగవంతు డాశీర్వదించి ప్రసాదించె తనకని
బావి ప్రపంచశాంతిని స్థాపించ శాంతిచక్రవర్తితో 86

శుద్ధోదనుడా తల్లిని కుమారునికనియెద నతిని
శుభంబని మహదానందమొందె
శోభాయ మానంబుగా రాజదాని నలంకరింపచేసి
శాసించె దానధర్మములు గ్రహించ అర్తులనెల్ల 87

సిద్ధించె తన కోర్కెయని విభుండు పేరిడె
సిద్ధార్థుండని యా బాలునికి
సుఖశాంతులతో పెరుగ నా బాలుని
సిద్ధులైన విజ్ఞులు దీవించిరపుడు 88

మాయాదేవి యా బాలుని కనినదాదిగ
క్షయరోగియై కృశించ మొదలిడి
మాయగా మరణించె కొద్ది దినములందె
మాయగా దుఃఖము వెంటనె సుఖమున్నట్లు
మాయాదేవిమహినివీడి మాయమయ్యె 89

సిద్ధార్థుని పినతల్లి గౌతమీదేవి గారాబంబున
సుతుని లాలనా పాలనాది భారము వహించి
స్వయంబుగ పరిచర్య చేయుచు పెద్దచేసె
సంబోధించబడెనా సిద్ధార్థుండు గౌతముండై నాటినుండి 90

## గౌతముని బాల్యము



భూపతి బాలుని కుపనయనాది కర్మలజేసి
భూసురోత్తముడైన విశ్వామిత్రుని పిలిచి
భారము మీదె స్వామి యీ గౌతమునికి విద్య నేర్పుడని
భక్తి ప్రేమ పూరిత విశ్వాసంబున నప్పజెప్పె 91

విశ్వామిత్ర గురువర్యుండు సర్వశాస్త్రంబులు నేర్పె
విషయమేదియైన నొకక్షణమందె యా బాలుడు
వినోదంబుగ వెంటనే కంఠస్థముచేసి తిరిగి తెల్పుచుండె
విధాతయే తానైయుండ సర్వశక్తులెందు కొదవుండు? 92

మేధా సంపన్నుడు స్థిరబుద్ధిగలవాడై యందరి మన్ననలందె
మిగుల పడుచు ప్రాయమునందె సర్వ విద్యలందు ప్రవీణుడయ్యె 93

వేదవేదాంగములు సర్వశాస్త్ర మల్లవిద్యలాదిగ నేర్చె
మదమత్సరాలులేని మాలిన్యములేని
వెదజల్లెను దయాప్రేమల తన చెలికాండ్రపై
విశారదుడై వెలిగె యానాటి క్షత్రియ బాలుర నందెల్ల
విచిత్రంబుగ అతని మదిలో యెపుడును తెలియని
విశేషముగ పీడించు చుండె మదిలో యేదో కొఱతయున్నట్లు 94

విద్యాధ్యయనంబందె గాక గౌతముండు
విశ్వాస భక్తిప్రపత్తులతో మెలంగె గురువు యెడ
వినయ విధేయుడై అణగియుండె మాతృమూర్తిగ నెంచి
విమల గురుపత్ని పాదారవిందములంబడి మ్రొక్కుచుండె 95

'ఆత్మవత్సర్వభూతాని' యన్నట్లు జీవించుచుండె
అందరిని ప్రేమించి అన్ని ప్రాణులను సమమేనని
అందరికి ప్రబోధించుచుండె
అందరికి మోక్షమార్గం బదియే యనుచు 96

భగవత్సాక్షాత్కార ప్రాప్తికి అహింసయే మూలంబని
భగవద్భక్తి మాధుర్యమందేలియు మార్గంబదియెయని
భోగభాగ్యంబులే పరమావధి గాదని
భక్తిప్రేమలే భగవంతుని చేర్చు గుణంబులని తెలిపె 97

నిష్కపట మృదుభాషియై
నిశ్చల మధుర వాక్కులతో
నిరాడంబర జీవితముతో
నిర్ధనిక ధనిక తారతమ్య మెరుగని రీతిలో
నిజలాభ ఫలాపేక్షలేని శ్రేష్ఠుడయ్యె 98

మానవుని దుర్గుణమే హింసయనియె
మానవుని సంకుచితమే అపవిత్రము చేయుననియె
మానవుడు అహింస పాటించుటే ముక్తిమార్గమనియె
మానవుని ఆత్మప్రాప్తియే జీవిత ధ్యేయమనియె 99

## గౌతముడు విద్యనేర్చిన తర్వాత మానసిక దశ



రథచోదిత శ్రేష్ఠపండిత వినోదియా గౌతముండు
రాకుమారులతో నుత్తమ హయారూఢుండై
రాకుమారుల మృగయా వినోదవేట వలదనియె
రమ్య పథంబుగాదు మృగసంహారంబనియె 100

గౌతముడా కాలపు రాజనందనుల కార్యముల
గుర్తించి నివారించుచుండె బోధించి నిజధర్మంబు
గట్టిగా బోధించె యువజనులకు ధర్మజీవనంబు సేయ
గురుత్వ భావనులై విముఖులైరి వేటాడలేక 101

తండ్రి శుద్ధోదనుండు తనయుని సంసార విరక్తినిగని
తన తరువాత సార్వభౌము డగునట్లు చేయనెంచి
తగు రాజనీతి శాస్త్ర ధర్మతత్త్వము నేర్పించె
తదనుగుణ బుద్ధి వికసించి రాజ్యమేల 102

కాని భాగ్య భోగ్యములు అస్థిరంబులనియు శరీరమునకై
మనవలదు క్షణ భంగురమైన శరీరమునకై
వినవలదు అహంకార మమకారాల మనసు బోధలు
మన శత్రువులవియె మరిమరి తెలియుడోయి 103

మోక్షప్రాప్తియే మన గమ్యంబనియె
మృత్యుదేవతతోనే మన సంపదలంతరించు
మరువకుడు పవిత్ర జీవనంబు సేయుట ధర్మంబని
మహిలో అశాశ్వితంబులైన చేష్టలు వదలుడు
మాన్యులార అశాశ్వితంబీ సంసారంబని
మనసువిప్పి ఆ గౌతముండు విపుల ప్రబోధంబు చేయదొడగె 104

అస్థిర సౌఖ్యంబు లభిలషింపకుండె
అన్యుల దీనజనుల దిక్కులేని వారికి
అన్నివేళల సహాయపడుచుండె యా రాకుమారుండు
ఆ చిన్న ప్రాయమునందె అలరారె అందరి ప్రేమికుడై 105

* దరిద్రంలోని దీనజనులగాంచి
దరిద్రుల కష్ట పరంపరలనుచూచి
దీన జన కఠోర దేహ పరిశ్రమలగాంచి
దీనవదనుడై విషాదాంచిత మనస్కుడై కన్నీట్టుచుండె 106

సిద్ధార్థు డొకనాడు ధ్యానవనంబులో వినోదించుచుండె
సితపుష్ప ఫలాలచూచి సంతసించుచుండ
సరగున ఆకసమార్గాన చనుచున్న హంస గుంపుమీద
సరసనయున్న మరొక రాకుమారుండు తటాలున
సరియగు గురిచూచి వదలెనొక బాణంబు 107

ఆ దెబ్బతో నొక హంస రక్తసిక్తమై క్రిందయున్న
ఆ గౌతముని సరసన పడగ ఆ శాక్య రాకుమారుడు
ఆత్మీయ ప్రాణిగా యెంచి హంసను చేతపట్టి
ఆ రక్తసిక్త పక్షిని దీనుడై కడిగి తనమీదయున్న
అంగవస్త్రముతో తుడిచి నిమిరి ఇంటికి గొనిపోయి
ఆ గాయంబు నయంబుచేసి స్వేచ్ఛ నొందవిడిచె 108

ఒండొకచో కృషీవలుండొకడు యెద్దుల కాడితో అదలించుచు
ఓర్పుగా దున్నుచు నొక యెద్దును చీదరించుచుండె
ఒకింత వృద్ధాప్య భారముతో మెడమీదున్న పుండు బాధతో
ఒదిగి ఒదిగి పోలేక పోలేక నడుచుచుండె 109

గట్టిదెబ్బలగొట్టి ఆ రైతు తోలుటచూచి
మట్టిపై కారుచున్న యెద్దుమెడమీది పుండునుండి కారు రక్తాన్నిచూచి
గట్టిగ కళ్లు మూసికొని ఖిన్నుడై కన్నీరుగార్చె
ఒకనాడు సేదతీర్చుకొన నొకచెట్టుక్రింద గౌతముండుచేర 110

ఒక చీమల బారుపై ఒక బల్లి చెట్టునుండి దిగివచ్చి
ఒకింత సేపులోనె చీమలన్నింటిని మ్రింగివేయ
ఒకపుట్ట బొరియనుండి ఒక పామువచ్చి
ఒక్కపెట్టున యా బల్లిని మ్రింగివేయ
ఒక గ్రద్ధ రివ్వున ఆకసమునుండి వచ్చి యీ పామును తన్నుకపోయె
ఓర్చుకొనలేక నిర్విణ్ణుడై యా వింతచూచి
''ఒకప్రాణి మరోప్రాణి కాహారంగా బలియగుటయే జీవనమా
ఒకప్రాణిని మరో మనిషి బాధించుటయే జీవన సంసారమా
ఒక బలవంతుడు మరో బలహీనుని బాధించుటయే ప్రపంచ జీవనమా
ఓ దయామయా! కరుణామయా!!
హింసలేనిదే భువిపై సంసారంబు లేదా? 111

## గౌతముని వివాహ ప్రయత్నం

రాజకుమారుండా విధమైన బాధామానసంబుతో
రాజభవనంబు చేరి దీర్ఘాలోచనుడై అందు పరవశుడై యుండ
రాజు తనయుని స్థితిని గ్రహించి వివాహము చేసిన
రాకుమారుండు సంసార సుఖంబుల చవిచూడ
రాజ్యంబుకూడ నతని కప్పుచెప్పనెంచె 112

శుభసమయాన దండపాణి అను రాజు కుమార్తెను
శోభిత యశోధరాదేవిని తన కుమారునకిచ్చి
శ్రీలుచెలువార వివాహంబు చేయుమని
శుద్ధోధన రాజొక దూతను బంపె 113

అయోగ్యుడు భైరాగి గుణంబు లతనికున్నవని
అతనికి క్షత్రియ గుణాలెందును లేవని
అస్త్రశస్త్ర విద్యలాతనికి తెలియవని యెంచి
ఆ గౌతమునికా దండపాణి తన కూతురునిచ్చి వివాహం చేయుట
అన్యాయంబని తనకు తాను తలంచె 114

కాన యీ శుద్ధోధన మహరాజు కా మాట తెల్పక
తన కుమార్తె యశోధరకు స్వయంవరంబున వివాహంబు చేతునని
కనికరించమని రాజును వేడుకొనుచు తెల్పబంపె
తన కూతురు స్వయంవర ప్రకటన వెంటనే
మాననీయ రాజ్యము లన్నింటికిన్ తెలియచేసె 115

సిద్ధార్థుండా స్వయంవరానికి తన సహచర రాకుమారులతో
సిద్ధమైపోయిరి అనేక రాకుమారులా స్వయంవరంబులో పాల్గొన
సిద్ధార్థులు కాలేదు అందున్న మత్స్యయంత్రాన్ని ఛేదించరైరి
సిద్ధార్థ రాకుమారుండె గురిగా మత్స్యయంత్రంబు కూల్చివేసె
సిద్ధార్థుని యా యశోధర హృదాయనాద భరితమై
పిత యశోధర తండ్రి సిద్ధార్థుని క్షమాపణవేడి పరవశించె 116

ఆ యశోధరా సిద్ధార్థ కుమారుల కల్యాణోత్సవంబు
అనంత ఆనందోత్సాహాలతో ధండపాణి విభుడు గావించె
ఆత్మీయ సౌభాగ్యంబై యా యశోధరాదేవియై
ఆనందోత్సాహాల సంరంభముగ కాపురంబు చెలంగె 117

పతిభక్తితో హితైషిణిగా యశోధర సిద్ధార్థుని రంజింపచేసె
పలువిధాలైన సేవా తత్పరతతో సేవ చేయుచు
ప్రతియానయే విధంబుగ రిత్తపోక
పవిత్ర సంసార సంయోగంబు సాగుచుండె 118

ఒకచో ఆనందించు నట్లుండు నా సిద్ధార్థ రాకుమారుండు
ఒకచో మరియు స్మృతి పథంబున తోచు వైరాగ్య భావంబు
ఒకచో ప్రియావదనుండై కన్పట్టు మరియు
ఒకచో కల్లోలిత మానసిక వ్యథతో మెలంగు
ఒకచో సంసారమానందమయ మన్నట్లుండు
ఒకచో వైరాగ్యమే మంచిదన్నట్లుండె 119

సమున్నత సంసార జీవనుడై సిద్ధార్థుండు
సకల సద్గుణ సంపన్న సౌందర్య ముఖారవింద యశోధర
సంతోషానంద ప్రేమాంచిత భార్యగా
సంతత జీవిత పరమావిధియే సంసారం బని
సంపూర్ణంబుగ ద్వాదశ వర్షంబులు గడిపె 120

సిద్ధార్థుండొక ప్రభాతంబు నొక దివ్యాంగన ముఖోద్గత
సంగీత వేదాంత గీతము పాడగావిని తటాలున మేల్కాంచి
సరగున వైరాగ్య భావస్ఫూర్తి జాగృతమై
స్థిర ముకానిదే మానవ జీవితమను నా గీత భావమని
సారములేనిదీ జగమని మనోవ్యాకులత చెందె 121

వెంటనె సిద్ధార్థుండు రయంబున తమ రథసారధి ఛన్నుని చేరి
వేగిరిమె నగరంబు చూడమనసైనది రమ్ము పోదమనగ
విషయంబా శుద్ధోధన రాజుకు తెలిసి కుమారా
వలదీ దినంబు రేపుదయంబె బోదువులెమ్ము
విసుగు చెందకుము నామాట వినుమనియె 122

పితృదేవోభవ మాతృదేవో భవయని తానేర్చిన
పవిత్ర గురుదేవుల బోధలు గుర్తురాగ
పుత్రుడు తండ్రి యాజ్ఞపాలించుటయే కర్తవ్యమని
ప్రత్యుత్తర మీయక సరెయని తల పంకించి పోయె 123

శుద్ధోధన పాలకుండు మరుదినము తెల్లవారుసరికి
శీఘ్రంబున తామ్ర పత్ర చిత్ర వస్తువులతో యెటు చూచిన
శోభాయమానంగ నగరి వీధులన్నియు నలంకరింపచేసి
శోభిత మంగళవాద్య గీతంబులు పాడు బృందంబులు నిల్పె
శీఘ్రగతిన నా నగర వీధులందు వికలాంగులుగాని
శోకతప్తులుగాని రోగపీడితులుగాని లేకుండ 124

శాసించె మరుదినము తనయుని నగరిలో తిరుగాడ మనియె
పురమున సర్వత్ర వివిధవర్ణ సంశోభిత కాంతులు మెరయుచుండె
పురజనులత్యంతాదర ప్రేమలతో సిద్ధార్థు నాహ్వానించు విధంబున
పలు బాలికామణులు మంగళహారతుల పాడుచుండ
పురంబెల్ల భూతల స్వర్గంబాయను నట్లుండగ చేసె 125

రాకుమారుండు రథంబందాసీనుడై పురవీధులచేర
రథమును పురజనులు బార్లు తీరి సందర్శించి పలు విధంబుల
రంగరించిన దుస్తుల శృంగార సంతోషానందములతో
రంజిల్లవలె నూరేండ్లని యా రాకుమారు నెల్లరు దీవించ 126

రాకుమారుడా వింతసోయగ సంతోషానందముల గాంచి
రథంబునాపి శాశ్వతానందముగ జనులిట్లున్నారా యని
రమణీయ జగంబేనా యిది నా ఆలోచన తప్పాయని
రథంబు సాగుచు చనుచుండె దీర్ఘాలోచనుడై 127

పేద ముసలివాడొకడు కుటీరంబు వాకిటనిలచి
పెద్దగా కృశించిపోయి ఆకలి బాధతో అరచుచూ యీ
పేద నాదుకొమ్మని ఆ మార్గమందొక చోట
పండు ముదుసలి పట్టు కట్టెతో యుండ రాజభటులు
పరుగున వచ్చి యాతనిపట్టి ఆ కుటీరంబులోనికి
పొమ్మని యాతని మెడపై చేయివేసి త్రోయుచుండ
రాకుమారుని దృష్టి యాదృశ్యముపై బడియె 128

రాక్షస కృత్యములను దూరంబునుండియె కాంచి
రథమును శీఘ్రంబుగ నటు సారథి చన్నని దోలుమనియె
రధారోహియై యుండియు ఆ మనుజుని భటులను ముట్టరాదని
బిగ్గఅగా శాసించె
రయంబున ఆ ముసలి వానిచేరి ఆపాదమస్తకంబును తిలకించె 129

* పండు ముదుసలి పట్టు కట్టెనుబట్టి
వంగివణకుచు పారాడునది జూచి
పరమదుఃఖము నొంది అట్టి దుస్థితియె
అందరికి వచ్చు అన్న సత్యము నిత్యమనియెంచె కాబోలు 130

* ఛన్నా యిట్టి ఆకృతి కొందరికే వచ్చునా యెల్లరికిం తప్పదా
చెప్పుము సత్యము పలుకు మన సహజంబుగ యెల్లరికీదశ తప్పదనియె
"ఛన్నా నేను కూడ యీ ఆకృతిని పొందవలెనా"
"సిద్ధార్థ మహారాజకుమారా యీ దశ నెల్లరికి శిలాక్షరంబగుసుమ్మీ"
సిద్ధార్థుడు వెంటనే రథము మరల్చుమని కంట తడిపెట్టి బల్కె 131

మరొకమారు రాకుమారుండు ఛన్నుండు పురవీధులలో
మసలుచుండ పలు అన్యాయాల పరంపరలగుపడె
మరియు రోగపీడితుడగుపడి యరచుచుండె
మనుజులందరికి యారోగంబులు తప్పవని ఛన్నుడు బలుక
మది తల్లడిల్లి దుఃఖమొంది సారములేనిదీ జన్మంబని
మరియు యిట్లూహించుచూ యింటికి మరలె చింతాక్రాంతుడై 132

* ప్రాయమెల్ల మనిషికి పడుచు ప్రాయమునందె
అందచందము లెల్ల ఆనందములెల్ల
అనుభవించుటెల్ల అనర్థమైనదని యెంచి
అనంత శోకమొంది
అట్టి నిర్భాగ్య జీవివై నీ వయ్యెదవని
ఆరాటములంబడి అంతమొందెదవన్న
అర్థము గ్రహించితివి కదోయి 133

మరొకనాడు రాజనగరు చూడాలనికోరి
ఆ నగర దారిలో పోతుండగా గౌతముని కగుపడిన సత్యదృశ్యము

* పాడెకట్టిన పీనుగ పయనంబుగాంచి
మున్నెన్నడు చూడని కన్నుదోయి
కరిగినీరై ఏకధారగ ఏడ్చి ఏడ్చి
కుమిలి కుమిలి వెళ్ళిపోతివా
కందిపోయిన కుళ్ళు వదనముతో 134

* "ఓ ఛన్నా ఏమిటా నల్గురు మోయు మేనా యేమిటి"
"ఓ గౌతమ రాకుమారా మేన కాదది పీనుగపాడె"
"పీనుగపాడె యననేమిటో తెలుపుము నా ప్రియ ఛన్నా"
"పీనుగయన్న ప్రాణములేని మానవ శరీరంబు
పాడె యన మరి యా శవమును మోయుటకు
గట్టి కట్టెలతో నిర్మించిన నల్గురు మోయు సాధనంబు"
"అట్టి స్థితి యందరికి వచ్చునా మరి నాకు వచ్చునా"
అవశ్యము తప్పదా దశ యెవరికైన యుర్విలోన
ఆలకించి నమ్ముడు నా యీ సత్యవాక్యంబు 135

పట్టి దేహము కట్టె దేహము
కాటి మధ్యన కాలిపోవును
కలసివచ్చిన కాలమందని
వినిపించె నేమో వినులార 136

రథసారధి ఛన్నుని చూచి



పాడుజన్మము పలువిధాల
బ్రతికి బ్రతికి
చవికి చవికి
చితికి చితికి
చచ్చిపోవుటయే
చివరిదశయని విలువలేనిది వింతజన్మమని 137

రాజువైపుట్టి రాజసాన రంజిల్ల తలపోయలేదు.
తామసంబున తరింప తలపోయులేదు.
చింతవంతలు సమసిపోయి
ఛిద్రమైన యీ చిత్రజగతిలో
చివరిధ్యానము ఆత్మధ్యానమె
అంత్యధ్యేయమని ఆహ్లాదమనియు
ఆత్మవిశ్వాసం
అమరిపోయెనా నీ
అంతరాత్మలోన 138

ఒకనాడు ధ్యానవనంబున చంద్రకాంత శిలా వేదికపై కూర్చుండి
ఓర్పుగా బ్రహ్మాండ మహాకావ్య శ్లోకంబులు పఠించుచుండ
ఒక్కుమ్మడిగా కంటనీరు కార్చుచు ముఖకాంతి హీనంబై
ఏకధాటిగ పెల్లుబికె వైరాగ్య భావంబు 139

ఆప్పుడతని కచట ఒక సన్యాసి అగుపడి ఇట్లుతెల్పె

అస్థిరంబీ సంసార జీవితంబు
అశాశ్వితంబీ శరీరంబు
అందర మీ చావుపుట్టుకల బంధనంబున
పండితులైన పామరులైనగాని 140

సారంబులేని సంసారంబున క్రుంగుట తప్పదు
సర్వులిందనుభవించు దుఃఖభాజనులై
సాంసారిక నీచపాశములంద గుల్కొని
సర్వపుత్ర మిత్ర కళత్ర ఆత్మీయులనురాగములెల్ల
సంపూర్ణ అనర్థములే సుమ్మి యనియె
సిద్ధార్థ రాకుమారునికి ఓంకార ముచ్చరింపుచుండుమని యుపదేశించె 141

గౌతమునికి పుత్రజననం

యశోధరాదేవికి నవమాసములునిండి
యశంబుమీర నొక పుత్రరత్నంబు జనించె
యశోధరాదేవి యా సిద్ధార్థుని యందున్న విషాదము గని
''యశో విశారదా తనయునిజూచి ప్రేమతో సుఖించరాదా!'' 142

కొడుకు పుట్టెనని కొండంత ప్రేమతో తెలుప
కంటినుండి ఆనంద బాష్పములకు మారు
మమత లన్నింటిని మట్టిపాల్చేసి
మంటికివేడి నీలాలు కార్చినావె 143

ఆలుపిల్లలనెల్ల హత్తునచేర్చి
ముద్దులాటతో మురియ నెంచలేదు
రాజ్యసౌఖ్యంబు భోజ్యసౌఖ్యంబు
అనుభవించుటెల్ల హక్కులెల్లగల్గి
అనుభవించలేదే అహ్లాదంబుగ 144

తండ్రి యా సిద్ధార్థుని స్థితిని గని శోకతప్త హృదయుండై
తనయుని వైరాగ్యంబు నివారింపలేక
తుదకు తలంచెను ఈశ్వరేచ్ఛయే జరుగునని
తల్లడిల్లుచు తెగించి నాపుకొనె దుఃఖంబునెల్ల 145

భార్య యశోధరాదేవి పలువిధంబుల ప్రశ్నింప
భర్త మౌనము వహించియుండె
భూపతులెవ్వరు యిట్లుండ యెందును వినలేదు కనలేదనియె
''భూపాలా మీవంటి పురుషోత్తము లిట్లుండ పాడియగునె
భూషితంబుగ నేలుకొనుము మమ్ము చింతమాని'' 146

నిరంతరంబుగ జీవరాశి పెరుగుచుండ
నిరంతరంబుగ జీవులు నశించుచుండ
నిరంతరంబుగ భాస్కరుడుదయించును మునుగును
నిరంతరముగ గగన తలంబును తారకలు మెరయుచుండ
నిరంతరముగ పగలు రాత్రి సమయా లగుపడుచుండ
నిరంతరంబుగ నిజపుత్ర కళత్ర జననీ జనకాదుల
నిరంతరంబుగ మనుజులు ప్రేమించుచుండ
నిజమా సంశయమాయని యింకను గౌతమునికి
నిజసృష్టి తత్త్వముపై సందేహ నివృత్తి కలుగదయ్యె 147

ఒకనాడు ధ్యానవనంబున సిద్ధార్థుడుండ
ఒక బంధువైన రాకుమారుండు వచ్చిచూచి
సిద్ధార్థుని వైరాగ్య భావంబులు విని నేస్తమా
సహజంబురా యీ లోకంబు నందావందంబు లనుభవింప
సిద్ధమగుటకే కదా యింతు జన్మించితిమి
దేహేంద్రియ సౌఖ్యంబులకే జన్మించితిమి
సహజంబుగ దేహేంద్రియా లుండలేదా?" 148

## సిద్ధార్థుడు తన భ్రాతకు జవాబు తెల్పిన విధం

సుస్థిరానందము లీయజాలవీ దేహేంద్రియాలు
సుస్థిరాలు కావీ పుత్రకళత్ర సంసారాలు
నేస్తమా శాశ్వితంబుకాని పరివర్తన గుణమే దేహానిది
నిరంతర పరివర్తనము లేనిది ఆత్మయే
నిరంజన నిర్వికారమైనది ఆత్మయే
నిర్మలానంద చంద్రికావికసితమే ఆత్మ 149

అశాశ్విత దేహాన్ని నమ్మి అనంత దుఃఖమయ
అశాంతి అసౌఖ్యాలతో నున్నదే యీ సంసారంబు
అనంత దివ్యప్రకాశ సర్వేశ్వరుని తెలియుటే
ఆత్మనుచేరి శాశ్వితానంద మనుభవించుటే మన ధర్మంబనియె 150

కడు చిత్తవృత్తులందీ దేహము తగుల్కొనియుండి
కామము క్రోధము లోభము మోహము మదమత్సరాల
కల్గియున్నది రాగద్వేష ఈర్ష్య నసూయల మరియు
కల్గియున్నది దంబము దర్పము అహంకారమాదిగ
కల్గించును మానవ జీవితంబు కల్మషంబుగ 151

కాన యవ్వాని దరిజేరనీయక యాత్మను చేరవలయు
చెలిమికాడా పై పదమూడు చిత్తగుణములే
చెఱచుచున్నవి మానవజన్మను నమ్మి
చిత్తవికారమైన యీ దుర్గుణముల వీడవలయు
చిత్తంబు సాత్వికంబగుటయే శ్రేయస్కరంబు 152
చతుష్టయ సంపద్విశేషంబులే మోక్షమొంద మూలంబు

శాశ్వత అశాశ్వతంబు లేవియొ తెలియవలయు
శాశ్వతంబు పరమాత్మ జగంబు నిత్యంబు
శ్రేయంబగును వైరాగ్యంబు మాత్రమె
శాశ్వతంబుగ నాత్మను బంధించు వనితాది ధనకనకంబుల్ 153

మహాజ్ఞానంబు తెలిసినవాడై తననేస్తంబునకు
మరిమరి తెల్పుచు రాత్రికి రాచనగరు చేరె సిద్ధార్థుండు
మరియు పరుండిన నిద్రరాక జ్ఞాన కాంక్షయే స్ఫురింపుచు
మునిగిపోయె నిద్రావస్థలో చాల అలస్యంబుగ 154

" సిద్ధార్థా ఉత్తమ సమయంబిది నీకు
సంసారమును త్యజించి జ్ఞానివై రాజ్యమును త్యజించుటయా లేక
సార్వభౌముడవై రఘుకులాన్వయ దివాకరుడవై
సౌభాగ్య రాజ్యలక్ష్మిని సేవించుచు కీర్తికాయుడవై
సుదతి భార్యా తనయుని మనసార ప్రేమించి
సుతరము ఆనంద ధోలికల నీమటకే యిచ్ఛగింతువో
స్వప్నంబులో ఆలస్యం అమృతం విషంబగునని విశదంబుగ పలికె
స్థిరంబుగ తెల్పుము లెమ్మని అశరీరవాణి 155

ఆ స్వప్నంబు నుండి తేరుకొనునంతలో
అమాంతముగ దిక్కులు పిక్కటిల్ల దీన జీవులైన
అశేష సహస్ర స్త్రీ పురుషులు రక్షింపుము! రక్షింపుము!!
ఆశ్రిత మందారుడవై వెనుదిరిగిపోకుము
అనర్థమైన సంసారమును నమ్మకుము
అశాశ్వత జీవిత సంసారంబులో మునిగి
మా వలె కామాగ్నికి బలి గాకుము
ఆదుకొనుము రమ్ము రక్షింపుమన్న
ఆర్తనాదాలా గౌతమునికి పలుమారు వినంబడె 156

సహన సంసారుల ఆక్రనందల విని సిద్దార్థుడు అప్రయత్నంగా
సర్వేశ్వరా నీ మహిమయపారము అనంత అద్వితీయంబు
సత్వ స్వరూప సర్వశక్తి సంపన్నా స్వయంభూ
సంశోభిత వేద వేదాంగోపనిషద్గుణ సంసేవితా ఆత్మ స్వరూపా
సర్వ సంరక్షకా నినుకన శక్తిలేదు రక్షింపుము! 157

సర్వాంత ర్యామివై దుష్టశిక్షణ శిష్టరక్షణా
సంసార క్షేత్రమున సద్ధర్మాన్ని స్థాపించి
సమస్త లోకాలను రక్షించు నీకివేనా ప్రణామంబులని
విశాల విశ్వసేవయె శాశ్వితానంద బ్రహ్మలోక మూల మార్గంబని
విశ్వేశ్వరా నీ కృపవలన నేడు గ్రహించితి 158

వ్యామోహంబు వీడితి సంసారంబుపై
వ్యామోహంబు వీడితి పుత్రకళత్ర జీవితంబుపై
విశ్వభూతంబులో సర్వజీవదయావృత్తియే నిర్వాణమార్గంబు
వ్యామోహాతీత సర్వభూతహితానురక్తయే సర్వప్రాణి ధ్యేయంబు కావలె
విశాల మానవ ప్రపంచ చతుర్దిశల ద్వితీయ ప్రభావోద్భాసితమైయున్న
విశ్వేశ్వరా నీ దివ్యజ్యోతిని గాంచితి నేను సూక్ష్మదృష్టిచే
విస్తీర్ణంబగు విశ్వక్షేత్రంబున సంచారము చేయుదు
వినలేని మూఢజనుల కపర సౌఖ్యప్రదంబగు
విశిష్ట ఆధ్యాత్మిక ప్రబోధము చేయుడు ఇపుడే లేచివత్తును" 160

పరాత్పర పదారవింద ధ్యానతత్పరుడై సర్వేశ్వరునికి లేచి నమస్కరించి
ఆ రాత్రి నిబిడాంధకారంలో శయనగృహముబాసి
సారధి భవనంబుచేరి పిలిచె
సారథి మేల్కొంచి 'అకాలంబున నిటురా కారణంబేమి రాకుమారా
సరగున తెల్పు మన సిద్ధార్థుడు తాను గృహపరిత్యాగము
సేయుటే సంసారంబు వీడుటే నా కర్తవ్యంబని
సిద్ధమైనాడనని వెళ్ళవలె అజ్ఞాతంబుగ ననియె
రథసారథి ఛన్నుడు "రాజాజ్ఞ లేనిదే నేను
రథంబుదెచ్చి తోడ్కొనిపోవ రాజధిక్కారమగు ననగ
రాజాజ్ఞ మిన్నయా నామీద ప్రేమ నీకులేదా?
రమ్ము నిజప్రేమతో లెమ్ము తెమ్ము ఆలసింపక
రథంబనగ సారథి యిట్లనె ప్రభూ ప్రేమ నీయందే నాకు
రయంబుగ తెచ్చెదనని నిశీథిలో ఛన్నుడు రథంబుతెచ్చి
నిలిపె నగరు ముఖద్వారంబున 161

* వట్టిభ్రమలు మట్టిపాలని
గట్టిమర్మము చేపట్టవలెనని
దిగులుపడి గుబులుచెంది
గట్టిచేసిన దిట్టమనసుతో వెళ్ళిపోతివా 162

* చావు పుట్టుకల తిరుగు యీ
చిత్రజగ చక్రగతిని దాట
చెయ్యన సకల సామ్రాజ్య కాంక్షను చంపుకొని
చంద్రబింబమువంటి నీ
చంటిపాపను చల్లని చెక్కిళ్ళను
చివరి ముద్దుతోడనే మురిసి
సకల సద్గుణ రాశియైన నీ సతి యశోధరను
సర్వశ్రీమాతగా నెంచి
అంత్యదీవెనచేసి
అనర్థ సంసారంబుధి ధాటి
ఆ అర్ధరాత్రిలో కానల కేగితివా
సర్వసంగ పరిత్యాగివై
సంపూర్ణ శాశ్వితానంద సంపాదనార్థమై 163

* ఈ ఇంద్రజాల
ఇలలోన నీవు
వలలోన పడక
ఇల కృతార్థుండవై
సిద్ధి పొందితివయ్యా!
సిద్ధార్థుండవై!! 164

ఛన్నుడు సిద్ధార్థులరుగుచుండిరి రథంబులో
చిన్న అడవులు ఘోరారణ్య భూరుహ సంచయంబు మధ్యలో
చల్లన పిల్ల తెమ్మరలు సోకంగ
మెల్లమెల్లగ ప్రయాణంబు సాగుచుండె
చిత్ర చిత్ర పుష్ప సంచయ సౌరంభంబులో
చిత్ర విచిత్ర దృశ్య సందర్శనంబుతో
చంద్రనాథుని తారకమండలి వెలుగులో
చిత్ర శాంతిమయ మనంబుతో చిత్ర నైర్మల్య
సూర్యోదయమయ్యె భార్గవాశ్రమంబు చేరగ 165

సిద్ధార్థుండు ఛన్నుని ఇక రాజనగరు కరుగమనె
సంసారుల ప్రేమతో గాక నిజ ప్రేమతో నన్నిటకు తెచ్చితివి
సాధువునై నీకు వందనము లర్పించుచున్నాను
పరేశ్వరాజ్ఞ నుల్లంఘించజాల మెవ్వరైన 166

ఆ రథసారథి ఛన్నుడుండగనే తన కేశములను ఖండించుకొని
అతనికున్న రాచరిక దుస్తుల నటుపోవు నొకభిక్షుని కిచ్చి
అతని దుస్తులను రాకుమారుడు సంగ్రహించి
అపుడె ధరించి ఇక తిరిగి పోమ్మనియె 167

## ఛన్నునికి సిద్ధార్థుని బోధ

వ్యాకులిత సారథి కన్నులనుండి కన్నీటిధారలుప్పొంగ
'వ్యాకులత అవిద్యకు మూలమయ్యా!
వ్యామోహము అవిద్యకు మూలమయ్యా
విజ్ఞానము అవిద్యయే యనవలయు
విద్యయే జ్ఞానమిచ్చునదయ్యా!
విజ్ఞులు జ్ఞానవిద్య తెలియక విజ్ఞానమిచ్చు విద్యయని
విశేషంబుగ పలుకు చుందురు ఛన్నా' 168

"వినుము ఆ విద్య సంసారంబు కోరు
విజ్ఞానంబు సంసారంబు కోరు
విద్య జ్ఞానంబు కోరు
విద్య సంసారంబు త్యజింపచేయు
విజ్ఞానంబు జ్ఞానంబు కాదయా ఛన్నా" 169

నా మాతృదేవి మాయమయ్యెగదా
ననుగని మాతృదేవి మరణించగనేల?
నన్ను కనుట కెన్నియో వ్రతములు పూజలుచేసె
ననుజూచి యానందించగ యెటకేగెను ఛన్నా? 170

సత్యము గ్రహింపక క్షణభంగుర శరీరమునకై
సంపూర్ణ విశ్వాసము కల్గియుండ అవివేకముగాదె
సోదర ఛన్నా మూఢునివలె వాపోవ నేటికి?
సత్కార్యము లాచరింపు నను గుర్తించి
సంతోషాయత్త చిత్తుడగుటయే మిత్రుని ధర్మంబనియె! 171

"అనాత్మ నిత్య క్షయంబుగలది
ఆత్మ నిత్య చైతన్యంబుతో నుండు
ఆత్మ జడ దుఃఖమయంబు
ఆత్మ నిత్య సత్యంబు
అనాత్మ షడ్వర్గంబుతో నుండ
ఆత్మ పరిపూర్ణ నిత్యానంద మిచ్చు
అని తెల్పబడె ఆర్య శాస్త్రంబులెల్ల" 172

"ఆత్మకు ముక్తి కలుగ
అహంకారంబు వీడవలయు
అజ్ఞానం ప్రకృతి మాయయే
అదే అశాశ్వితంబు.
ఆ మాయయే సత్యంబసత్యంబుగా
ఆ మాయయే అసత్యంబు సత్యంబుగా
అవిద్యాపరులకు తోచుచుండు" 173

'సుజ్ఞానంబు తెలియలేక జనులు
సుస్థిరంబు కామినీ కాంచనంబులని
సుంతయు మూర్ఖుడై కష్టములను పొందు
సుఖములేక సంసారి పుడమిబ్రతుకు' 174

'చింతయుని సుమంతయునులేక
ఛన్నా సంతసంబున చేరుము గృహంబు
చేరి నా వార్త తెలుపుము గృహిణితోడ
చింతలు వలదని తెల్పుము నా తల్లిదండ్రులకు
చెప్పుము వారికి నా ప్రియమార వందనంబులని
సిద్ధార్థుడు తన తండ్రి కిట్లు తెలుపుమనియె' 175

'సంతతం సాత్వికాహారంబునే తినవలెనటంచు
సర్వేశ్వర ప్రేరిత ప్రతినిధిగా నేలవలయుననియు
సంతసంబున కడుపు ఆకలి తీర్చుకొనుటకే ఆహారంబు
సేవించతగు నటంచు
స్వపరభేదంబులేక పాలించుచు ధనము వెచ్చించుమనియు
సర్వభూత దయార్ద్ర చిత్తముగలవారే పాలించ నర్హులనియె
సరసంబుతో నిరంతర భోగపరాయణ భూపాలురు దైవద్రోహులై
సతతం దేవా ఈశ్వరా, ఈశాయని నామభజన చేసినా
సహజంగా వారు పరోపకారులు కాకున్న
స్థిరంబుగ నాస్తికులే వారని ప్రకటించి అట్లు తెల్పుమ'నియె 176

## శుద్ధోధన గౌతమీదేవి మరియు యశోధరాదేవి శోకించుట



ప్రాతఃకాలంబులో రోజు చనినట్లే రాజు సిద్ధార్థుని మందిరంబుచేర
ప్రముఖంగా ద్వారములన్ని తెరువంబడియుండె కాని
పలువిధంబులందు వెదకినా సిద్ధార్థుండు కానరాడు
పలుకలేదు రాజనగరంబు నం దెక్కడగాని
పరులెవరో రాత్రి అర్ధరాత్రిలో ఛన్నుడు గౌతముడెటకో
పయనంబై పోయిరని తెలియచెప్పగ
ప్రభవించె శోకఘోషలు రాజు రాణి కోడలి యశోధరనుండి
ప్రజాసమూహములు రాజమందిరము నిండి ఘొల్లుమనగ 177

శుద్ధోదనుండు గౌతమీదేవి మరియు యశోధరాదేవి వెదకుడని
శోకసాగరంబు మునుంగ పరిచారకులు చారులు వెదకబోయిరి
కపిలవస్తుపురి నగరు మరియు నా రాజ ప్రజ మొత్తంగా
కడుదుఃఖభాజనులై విలపించిరి తమకిక దెక్కెవరాయని 178

నాల్గురోజులు గడచెను సిద్ధార్థునిజాడ తెలియదాయె
నలుదెసలనుండి వార్తాహరులు జాడతెలియక వచ్చిరి
నారీమణి యశోధరాదేవి పెద్దపెట్టున రోదించసాగె
నగరమంతయు క్షణమాత్రంబున విషాద రోదనధ్వనులు మారుమ్రోగె
నలిగిపోయె శుద్ధోధనరాజు ఆశాపుష్పాలు హతాశుడై 173

అంతలో సారథి ఛన్నుని రాకగురించి తెలిసె
అమాంతము సర్వులాతని చుట్టుచేరి ఏడీ సిద్ధార్థుండని
అనేక విధంబుల ప్రశ్నల వర్షంబు కురిసె ఛన్నునిపై
ఆపుకోలేని దుఃఖితుడై సంసారముపట్ల వైరాగ్యంబూని
ఆనందాతిశయంబుననే గృహపరిత్యాగము చేసెనటంచు తెలిపె 180

రాజమందిరంబెల్ల అశాంతి ఆక్రందన లతిశయించ
రాజు శుద్ధోధనుండు గౌతమీదేవి పొరలి పొరలి రోదించ
రమణి యశోధరాదేవి నాథుడులేని సంసారంబు నిస్సారంబనియె
రోదించె కడుదుఃఖితయై రాత్రింబవళ్ళు 181

మాతాపితలు పుత్రికా సుతులున్నను స్త్రీకి
పతికి సమానము కారని యేడ్చె యశోధరదేవి
సతికి పతియే దైవము గురువును బంధువువలె
పతిలేని సతి యెండిన మ్రానుంగాదె' 182

సతి యశోధరాదేవి అన్నపానీయాలు వదలి
సరగున శుష్కించిపోవుచుండ
సంరక్షణ కష్టమైపోయె శుద్ధోదనరాజుకు
సర్వ కపిలవస్తుపురి రాజ్యంబు కళాహీనంబయ్యె 183

## గౌతముడు రాజగృహారణ్యంబులో ధ్యానము చేయుట



మహాత్ముడు సిద్ధార్థుడు దీర్ఘ ప్రయాణము చేయుచు
ముండిత శిరస్కుడై కాషాయ వస్త్రధారియై
ముదమార కందమూల ఫలాదుల నారగించుచు
ముద్దుగా నాయడవిలోని వన్య మృగంబుల చూచి
మురియుచుండె పరుండుచుండె కటిక నేలపై
మది నిశ్చలంబుగ నుండ చేయుచుండె ధ్యానంబు
మనుచుండె రాజగృహారణ్యంబందు జనుల కూడుచు 184

పలుభాగవతులటకుం చేరి యా దివ్యమూర్తిని కని
పవిత్ర వేదాంత గోష్ఠులు సేయుచు బాల స్వామియని
పిలుచుచుండిరాయన నా ప్రాంత ప్రజలు
పెద్దగ నా మునిని దర్శించుచు వినుచుండిరాయన బోధనంబు 185

ప్రేమయే పరమేశ్వర స్వరూపంబని
ప్రేమతోడనె విషముకూడ అమృతంబగునని
ప్రేమతోడనె దుఃఖము కూడ ఆనంద మగుననియు
ప్రేమయే భక్తిస్వరూప ఓంకారంబనియు 186

ఆ బాలస్వామి కీర్తి చంద్రికలు గ్రామాలకెల్ల విస్తరింప
ఆ గ్రామాల ప్రజలు తండోప తండాలుగా భక్తిగా వచ్చి
ఆనంద ముఖారవింద ప్రేమ దయాళుడుగా కీర్తించ
అశాశ్వత ప్రపంచాన్ని గూర్చి మరియు శాశ్వత దైవాన్ని గూర్చి
ఆనందాది యుత్సాహభక్తి శ్రద్ధలతో బోధించ సాగె 187

ఒకనాడు ఆ సిద్ధార్థుని వద్దకు మందబుద్ధిగల సన్యాసులువచ్చి
"ఓ బాలకుమారా మేము యోగులం వివేకంబుగ తెల్పుచున్నాము
ఓ రాకుమారా మోక్షము నొందకోరువారెల్ల
ఓర్పుగ విశేషోపవాసంబులు చేయవలయు లేదేని
ఒడలంతయు కడు కండల గండు దేహమై
ఒనకూరు కామక్రోధాది గుణంబులు
ఒప్పుగ మదించి మత్తుచెంది పవిత్రాంతఃకరణంబు
ఒకింత కలుషితమై భ్రమచెందు మానసంబు కాన
ఒనరగ శుష్కింప చేయవలయు దేహకండరాల" 188

రాకుమారా మేల్కాంచుము నీ దేహము మదించియున్నది
రయంబున ఉపవాసంబులు చేసి శరీరాన్ని
తగు విధంబున శుష్కింపచేయుము జ్ఞాన బుద్ధిబలంబు
తత్త్వంబు పెరుగు సూక్ష్మశరీరంబై శాశ్వతానంద దాయకంబగు" 189

సిద్ధార్థుడా సర్వసంగ పరిత్యాగు లనెడి పైవారి మాటలు
సత్యంబులు కావనియె యెటులన
కూలిపోయిన గృహంబు నందుండ మనుజుండు కోరునే
కృశించిపోయిన శరీరంబందున్న (జీవుడు) జీవాత్మనెట్లు
శుద్ధంబుగనుండ వీలగునా? మనోజ్ఞానంబెట్లు పెరుగును?
శరీరంబెట్లు ఆరోగ్యంబుగానుండు? కాన
మిత్రసత్తములారా అవిరాగుల బోధలు పాటించరాదు
మీరు బలవంతులు కావలె శక్తిగలవారై
మీరు స్వశక్తిగలవారైననే గీతా రహస్యమును తెలియగలరు సుమ్మీ
మరియు పరమేశ్వర మహత్తర అలౌకిక సామర్థ్యంబు
మహదానంద భావనులై తెలియంగలరు సుమ్మి 190

సాత్వికాహారంబునే తీసికొనవలయు నటంచు
సాత్వికాహారంబు వలన పరిశుద్ధ రక్తంబు చేరు
శుద్ధరక్తంబు నుండి శుక్ల శోణితంబులు జనించు
సంసిద్ధ శోణితంబునుండి ఓజస్సు తేజస్సులు కలుగు
సమర్థంబిటు ప్రాచీనార్య విరచిత గ్రంథంబులు తెలుపు 191

దేహమె సద్గతికి దుర్గతికి కారణంబౌ
దగ్గఱయున్న కత్తిచే నితరుల భయపెట్టవచ్చు
తామె ఆ కత్తిచేతనే తనే ఖండించబడవచ్చు
తగు రీతిగా సత్కార్యానికి దుష్కార్యానికి
దేహంబె తారసిల్ల సహజసిద్ధ కారణంబని తెలియుడో అన్నలార 192

## శుద్ధోదనుడు గౌతముని తోడ్కొనిరమ్మని అడవులకు మంత్రులను పంపుట

దీర్ఘకాలంబుగ రాకుమారుడు తాపసుల తపశ్చర్యల
దీర్ఘంగా యోచించుచుండె
శుద్ధోదనుడు ఛన్నుడు యశోధర దుఃఖమును చూడలేక
శుభంబుగ మంత్రులను పిలిచి అడవులకుపోయి సిద్ధార్థుని
శుభంబుగ యింటికి తోడ్కొనిరండని మంత్రివర్యులనాదిగా బంప
కొన్నిదినంబులకా రాజగృహారణ్యము మంత్రులు చేరి
కడుదీనులై భక్తితో చేతులు జోడించి మ్రొక్కి 193

మహాత్మా నీకు తెల్పెడివారము కాము యశోధరాదేవి
మహా దుఃఖానలంబున క్రుంగి కృశించుచుండ
మహారాజు శుద్ధోదనుండు కడు దుఃఖభాజనుడై
మమ్ముబంపె మిమ్ము ఇంటికి తోడ్కొనిరమ్మని'' 194

రాజదంపతులు దినదినానికి క్షీణించుచున్నారు
రమణీయ యశోధరాదేవి ఉపవాసంబులతో కడుజిక్కియుండ
రాజ్యంబులోని ప్రజలు యథారాజాతథా ప్రజయన్నట్లు
రోదించుచు ప్రశాంతము లేక అశాంతిలో మునిగిరి
రాజకార్యము లన్నియు అస్థవ్యస్థములయ్యె
రమ్ము మహాత్మా మము సర్వులను బ్రోవదయాళుండవై 195

## గౌతముడు మంత్రి వర్యులకు సత్యమును గురించి తెలుపుట



సిద్ధార్థుండవ్వారి మాటల అర్ధనిమీళిత నేత్రుడై వినుచు
స్థిత ప్రజ్ఞుడై వినుచు తెల్పెవారికిట్లు " అమాత్యులారా
స్తిమితులై వినుండు నేను సత్యాన్వేషినై యున్నాడ
సత్యము తెలియకున్న నే నగ్నికణాల మ్రింగి మరణించెద కాని
సంసారంబులో చేరను మరియు సత్యాన్ని
సాధించ అవిరళకృషితో యున్నాడ
సాధ్యము కానిదేదియూ దైవ సృష్టిలో లేదు
సాధనతో యేదైన సమకూరు ధరలోన 196

ఆత్మ దర్శనంబు కావలె
అపుడే భుక్తికి ముక్తికి మార్గంబుండు
అందే సమస్తానికి మూలమున్నది
ఆత్మ విశ్వాసమే శాశ్వితానంద బ్రహ్మనిలయంబగు 197

మనుజులు తమ్ము తామే శక్తిహీనులుగను
మరియు దురదృష్ట హీనులుగనెంచి
మగిడి బ్రహ్మరాతయని వా పోవుచు
మనోచాంచల్య మాలిన్య ప్రేరణచే
మూఢులై సంసార వికారంబులో పడి
మహాపాపులై కష్టసుఖాల అడకత్తెరలో పడి
మడియుటే మూఢుల అవస్థా కార్యంబు 198

సచివోత్తములారా అజ్ఞానంబునయున్న
సంసార ప్రపంచ మానవకోటి పరమావధిని
సంపూర్ణంగా తెలిసికొని అద్దాని బోధింపనెంచితి
సుజ్ఞాన శాశ్వితా నంద భరితులగుటకు మారు మీరు
సారములేని సంసార జననీ జనకుల దుఃఖవార్తను తెచ్చితిరి
సుతరంబుగ వ్యామోహంబు బాయుటయే ముక్తియనంగతగు 199

చింతిల్లకుడు విలపించుట బేలతనంబు గాదె
చింతవలననే దేవుడిచ్చిన తనువు క్షీణించు
చైతన్యులై సర్వేశ్వరుని వేడుము
చింతించి నిజ శరీరాన్ని చితి చేయకుడు 200

సచివ పుంగవులారా చెచ్చెరంబుగ స్వపురికేగి మీరు
స్వజన జననీ జనకులకు తెల్పుడు
స్వకీయ ప్రబోధంబును విశదంగా తెల్పుడు
స్వమాతాపితల వచ్చి నేను కౌగలించుకున్ననూ
సత్యంబుగా తప్పునా మరణావస్థ? 201

ధర్మేణహీనాః పశుభిస్సమానాః అని ఆర్యోక్తి
ధర్మము లేనివాడు పశుతుల్యుడే
ధర్మము లేనివాడు భ్రమాన్వితుడౌను
ధర్మ మెరుగనివాడు కాంక్ష ప్రేరితుండగు
ధర్మ మెరుగనివాడు భ్రమాన్వితుడై విషాదమొందు 202

భౌతిక ప్రపంచంలో సుఖదుఃఖంబులు
భౌతిక ప్రపంచంబులో కలిమిలేములు
భౌతిక ప్రపంచంలో స్వభావ సిద్ధంబులే
భౌతిక ప్రపంచ కతీత సుస్థిరానంద సంపాదనార్ధమే
భరింపరాని యీ సంసారంబు వీడి వచ్చితినిటు
భద్రంబుగపోయి జననీ జనకులకు తెల్పుడో మాన్యులారా 203

రాజగృహారణ్యంబున వటవృక్ష నీడలో
రాజకుమారుండు సిద్ధాసనాశీనుండై
నిరంతర ధ్యాన నిమగ్నుడై
నిత్యము సుస్థిర చిత్తుండై
నిమీలిత నేత్రుడైయుండి
చద్దెసలందు ఖ్యాతినొందె 204

మహాత్ములగు ఋషివర్యులంచేరి
మదికి సాధారణంబుగ తెలియని రహస్య తత్వాలను
మదింపు చేసుకొనుచుండె
మరి మరి సందేహ నివృత్తికై
మునులగాంచి తెలియ నుంకించుచుండె
మనుచుండెనా అరణ్యమందట్లు పంచవర్షకంబు 205

## సిద్ధార్థుడు - బింబిసారుని సంవాదము

ఒకానొక దినంబందు సిద్ధార్థుడా రాజగృహారణ్యాటవి సమీపంలో
ఒక వృక్షఛాయలోనుండ కొందరు గొల్లలు
ఒక గొఱ్ఱెల మందను తోలుకొని పోవుచుండ
ఒక చిరుత గొఱ్ఱెపిల్ల తల్లివెంట నడువలేక
ఒకింత వెనుకబడి అరచుచుండ నా సిద్ధార్థుండు జాలిపడి చూచె 206

*కరుణామయ సంకట మనసుతో
కుంటుచుపోయెడి ఆ గొఱ్ఱెపిల్లను పైకెత్తి
కనికరాన తన మెడమీద వేసికొని నడువసాగె
కరుణారసంబు పొంగిపొరల నా మందను వెంబడించె 207

గోపాల అన్నలారా యీ ఎండతాపంలో
గొఱ్ఱెలమంద నిట్లు యెటు తోలుకొని పోతున్నారన
గొల్లలు యీ ప్రాంతబింబిసార చక్రవర్తి
గొప్ప యాగము చేయుచుండ మమ్ము త్వరగా
గొఱ్ఱెలమంద తోలుకొని రమ్మని ఆజ్ఞాపించె అందుకే చనుచున్నామన
గొఱ్ఱెలనేమి చేయుదురా యాగంబునని సిద్ధార్థుండు ప్రశ్నించె 208

" ఓ సాధుపురుషోత్తమా మా ఆరాధ్య దేవతలే
ఒప్పుగ నాహారంబుగ కోరుచుందురు అపుడే వానిని వధించి
ఓదార్పుతో మేము మా గొఱ్ఱెలు క్షేమంబుగా జీవింతు మన
ఒక్క పెట్టున మది అల్లకల్లోలమొంది విస్మయంబున
"ఓ అన్నలారా యిట్లే దేవతలు తెల్పిరి మీకని" తొందరచే నడుగ
గొల్లలు "బింబిసార చక్రవర్తి యాగములో వధింప
గొఱ్ఱెలను తోలుకొనిరమ్మన మేమిటు తోలుకొని వెళ్ళుచున్నాముస్వామి 209

నేను మీ వెంటనే వచ్చెదనీ గొఱ్ఱెపిల్ల నెత్తుకొని
నన్ను మీ వెంటరాగ అనుమతించుడని
నన్నెత్తిమీత సూర్యుడుండి బహువేడి తాపంబుండినా
నిజప్రేమ కరుణాంత రంగుడై యా సిద్ధార్థుండు వెంబడించె 210

ఆ రాజవీధులగుండా యా ఋషితుల్యుండు వీపున
ఆ గొఱ్ఱెపిల్ల నిడుకొని చనుచుండ ఆశ్చర్యంబుగ
ఆ ప్రజలు ముక్కుపై వ్రేలిడి చూచుచుండగ
ఆ గొఱ్ఱెలమంద వెనుక చనుచుండె బింబిసారుని సభాసదనంబుచేర 211

ప్రజలు గుంపులు గుంపులుగా ఆ సన్యాసిని గాంచి
ప్రముఖంగా రాజనందనుడే సన్యసించి యిట్లు వచ్చెనని
పర్వత ప్రాంతంబున తపమాచరించు ఋషిసత్తముండని
పరుగెత్తుకొని బాలురవలె సంభ్రమాశ్చర్యాలతో
ప్రజాసంఘంబు నలుదెసలనుండివచ్చి బారులుతీరె
ప్రముఖంగా రాజసదనంబున ఋషిసత్తమునిగాంచ 212

రాజు బింబిసారుడాయనను కని "స్వామీ మీరెవరు?
రాకయిటు యెక్కడనుండి వేంచేయుచున్నారు?"
"రాజా నేనొక సాధువును మిమ్ము చూచుటకే వచ్చితిని"
"రాగద్వేషాలు వీడి వైరాగ్యంబనుసరించినాను"
"రంజిత కపట యోగులీ ప్రాంతమందనేకులు
రమ్మిటు ఆసీనులుకండు ఆ రీతి యోగులు మీరు కాదుగదా"యన
రాజు శుద్ధోధన తనయుండవని విని యుంటిని రాకుమారా
రాగరంజిత సంసారంబు వీడుట కాదు శ్రేయస్కరంబు
రాకుమారా మృదు మధుర శరీరంబు వృధాగా మట్టిపాల్జేయక 213

శీఘ్రంబుగ నీ గృహంబునకేగి నిజ కళత్ర పుత్ర మాతాపితలతో
శోభాయమాన సంసారంబు సాగించుచూ బడయుము సౌఖ్యంబు
శోకతప్తులై నిను నమ్మినవారుండ ఏమి న్యాయము
శుభంబుగ చనుము వెనుదిరిగి నీ రాజ్యంబు లేదేని
శాశ్వితంబుగ నా రాజ్యంబర్ధ రాజ్యంబిచ్చెద యిటనేవుండి
యేలుకొనుము 214

సంసారిక సౌఖ్యానందము నెందుకు వీడెదు
సమస్తవిధ వైరాగ్యంబులు వృధాయే
సాధిపత్యములేక బ్రహ్మచర్యంబు తప్పక చెడు
సార్థకంబుగ నామాటలు విని మరలుము నిజగృహంబుచేర 215

ధర్మార్థ కామమోక్షదాయకవిద్య నభ్యసించతగు
మర్త్యసృష్టి క్రమమదియే సిద్ధార్థా వినుము
దరిత్రిలో ప్రతిమానవుడుత్తమ సంతానంబు బడసి
పరిపూర్ణ కాంక్షల సఫలంబగునట్లు జీవించతగు
ధర్మంబుగ నీ యవ్వనమందీ కార్యము నెరవేరదు
వేరుగ తలచవలదు ఓ యవ్వన రాకుమారా
మరియు వృద్ధాప్యావస్థలో ధర్మంగా నిర్మలానందము కలుగు
బారమగునిపుడు వైరాగ్యంబు వదలుము సంసారంబుచేయుము 216

మోక్షాభిలాష యున్నచో భిక్షాటనంబుజేసి
మోహిత సాధువేషంబుల రోసి
యజ్ఞయాగాదులంజేసి రారాజువై
యశంబు నష్టయిశ్వర్యంబుల నార్జించవలెగాని
ద్వారద్వారంబునకేగి భిక్షాటనచేయుట
దరిద్రుల వృత్తియేకాని రాకుమారులకది రాణింపదు
కేవలమావృత్తి వికలాంగులకే యీశ్వరుడనుమతించు
కడు నీచంబగు భిక్షాటనచే నీకు మోక్షంబురాదు సుమ్మీ 217

పరాక్రమ సంపాదితంబగు నా మగధదేశంబు
పరిపాలించరమ్ము సకలైశ్వర్య దేవేంద్ర వైభవంబుతో
పరిపూర్ణ జీవితంబుచేసి సుఖించుము
విరక్తి భావము వదలి వీరుడవై ధర్మ వీరుండవై 218

రాకుమారుండు సిద్ధార్థుండు భూపాలుని పలుకులు
రాగరంజితంబులు కావని యెంచి అతడవ్వేళపు
రాజని ఆ ప్రలాపంబులే నిదర్శనంబని ఆ
రాజైన బింబిసారునితో కరుణాంచితుడై యిట్టులనియె 219

"నా హృదయ సంకల్పము పురాణ వైరాగ్య సంజాతమే యైనచో
నాయీ నిర్ణయ మార్గంబు నెరవేరు నిశ్చయంబుగ
నేను మీరు భావించునంతటి హీనస్థితిలో లేను
నాయెడ మీ వాక్యంబులెల్ల నిరర్థకంబె
నేను త్రికరణశుద్ధిగ సంసారంబు త్యజించితి
నేను త్యజించిన ధర్మాన్ని తిరిగి యెట్లు స్వీకరింతు 220

మానవుండు సుఖంబుల కోరియే దుఃఖియగుచుండలేదా?
మానవుడు విషయ వాసనలచే బంధితుడై
మోహజనిత జీవిపై ప్రారబ్ధంబున జిక్కి
మరిమరి దుఃఖ పరితప్తుడై బాధింపబడుచుండలేదా?" 221

శలభ మేరీతి దీపజ్యోతి కాంతికై మురియుచు
శాశ్వత సంతోషంబదియని దీపంబుచుట్టు తిరిగి తిరిగి
శక్తిహీనమై అందేపడి దగ్ధంబు అగునట్లు
శోభిల్లగా సంసారంబు చేసి చేసి దుఃఖితుడై అందే మరణించు 222

తానున్న కొమ్మనే ఖండించుకొను మూర్ఖుడెట్టివాడో
తప్పక సత్యధర్మ పథంబు నెడబాయువా డట్టివాడే రాజా
తరుణాంచిత బాల ప్రాయుండనైన నాకు
తగుకార్య పరతంత్రుడ నగుచున్న నాకు
తండ్రిలాంటిమీరు సహాయంతో ప్రోత్సహించక
తగని ప్రతికూల పలుకులం బలుక మీకు న్యాయమా 223

జరామరణ రోగగ్రస్తులగు సంసారుల దుస్థితి చూచి
జనించినవారు మరణించక తప్పదని తెలిసి
జనించెనిట్లు సంకల్పంబు సన్యసించ విరాగినైతి
జీవితంబు సార్థకంబు చేసికొననెంచి
జీవిత విషయంబు భయంకర భయవిశేష మీ జగంబనియె 224

ప్రబల శత్రువులగు కామక్రోధాదులు చిత్తమనెడి భూమిని
ప్రచండముగ చీల్చిచెండాడు
భక్తిబీజంబులు లేకుండ చేయు మానవునియందు
భోగియై బంధంబునజిక్కి కడు దుఃఖితుండై
మోక్షమార్గంబు కానలేక
మగిడి పుట్టుచు గిట్టుచుండలేద భూపాలా 225

భూపాలుని కొక రాజ్యముండ తృప్తిలేక
భూవలయంబె తనయాధీనంబుకై తారసిల్లి
పూర్తిగా దురాశయే వారి నట్లుచేసి కోర్కె
పూర్తిగ నెరవేరకున్న దుఃఖించునట్లు
పుడమిలో మూలము తృష్ణయే దుష్పరిణామంబులకెల్ల 226

కాంక్షయే నిత్యంబు దుఃఖంబు కల్గించు
కాంక్షయే సత్యంబుగ దురాశ కల్గించు
కాంక్షయే నిత్యంబుగ నిరాశ గల్గించు
కాంక్షయే రాగద్వేషాలందించు
కాంక్షయే నిరంతరంబుగ మోహంబు పెంపుచేయు
కాంక్షయే నితరంబులందు కరుణ ప్రేమలు లేకుండచేయు
కాంక్షయే మోక్షంబు కోరనీయదు సుమ్మి 227

పంజర బద్ధమగు పక్షి ప్రయత్న సంయోగవశంబున
అంబరంబున కెగసి విముక్తిబొంది తిరిగి
పంజరంబు చేర నెట్లు యిచ్ఛగించు?
అనర్థంబగు కాంక్షను నిగ్రహించి నద్దాని వీడిన
పరుండెట్లు కాంక్షతో మనగల్గు భూపాల 228

ప్రాపంచిక వ్యామోహ జనులు
ప్రాణ భయంబుతో నుండియు
ప్రాణంబులు వీడుచు మరియు పుట్టుచునుండ కోరు
ప్రాపంచిక సుఖంబుకోరు నరుడు
ప్రదక్షిణంబులుచేయు జనన మరణంబులందు
ప్రపంచ కాంక్షలతోనె ప్రాణభయ దుఃఖంబులనుండు కాదోయి 229

రాజా వృధా ప్రయాసలేల యజ్ఞయాగాదులు
రంజిల్ల చేయుజాలవు మోక్షంబు నొంద
నీ వుద్దేశ్యము వ్యామోహ భావోద్భూతంబు వినుము
నిర్దోషులగు జీవంబుల బలిచేయ హత్యయెకాని
నిజమోక్షమార్గం బదెన్నడు కానేరదు
నీతియగునె మానవులకు
నిర్వాణముచెంద రక్తసిక్త మానవుండర్హుడెట్లౌను? 230

విచారించుము ఓ రాజా
వికృతంబీ యజ్ఞయాగాదులు
విడువుమిట్టి యహంకార పాపమార్గంబు
విశ్వశాంతికి మోక్షమార్గంబునకు
వినుము అహింసామార్గంబొక్కటియే మోక్షమార్గంబు
విడువుము యీ ప్రాణులనెల్ల బలిచేయక
విహితంబీ నోరులేని జీవాల స్వేచ్ఛనొంద 231

హింసవలన నరకమె సంప్రాప్తమగును మోక్షంబురాదు
హింసవలన మనుజుండు క్షయంబునొందు స్వర్గంబు చేరడు
హింస రాక్షసగుణంబెగాని మోక్షమొందు గుణంబుకాదు
హింసచేత మీపైయుండు పూర్వ పాపభారంబు పెంచుకోనేల
హింసతో జన్మ సార్థకంబుగాదు తెలియుము ముక్తిలేదు 232

ప్రభువులు సర్వేశ్వర ప్రతినిధులగు మీరె యిట్లు చేయ
ప్రజల ప్రమాద పరిస్థితి యెట్లున్నదో
ప్రజానుకూల పాలనెట్లుండునో
పౌర జన శ్రేయ మేవిధంబున కల్గునో
పరమేశ్వరు డేవిధంబున కరుణించి కాపాడునో
పలుకుడు తెలియుము సత్యమార్గంబు 233

ధర్మ పరిజ్ఞాన దూరుడవై యిటు మాట్లాడితివేల?
ధర్మదూరుడవై సర్వోత్తమంబగు నా ధర్మాన్ని దూషించనేల
మర్మంబేమన మాయానురాగమే మిమ్మటు నడపించినది
ధర్మప్రేమ నాపైయుండుట జేసియెకదా మీ యీ బోధ 234

శాంతచిత్తుడవై వినుము ఓ రాజా
శాశ్వతంబుగ వ్యాకులత నెడబాసి ఆత్మీయులుగా ప్రజలనెంచి
సమస్త జీవరాసుల యెడ దయారసంబు వెల్లివిరియ
సర్వవేళల తన్మయుండవై నిత్యానందమందుండుమని
సిద్ధార్థుండాసనము దిగి నన్ను క్షమించుము
సెలవొసంగుము నాకని పలికి బయటకు నడచె
సమ్మోహితుడై శిలాప్రతిమవలె రాజాసనంబునందే
సహజంబుగ నట్లెకూర్చుండియుండి నోటమాటలేక
సరగున నేత్రంబులనుండి జలజల ఆనంద భాష్పంబులురాలె 235

బింబిసార మహారాజు అహింసనుగూర్చి విన్నవిధంబు
బిగువుగా మానసంబును పీడించి బంధించె
యాగాది జంతుబలి పాపమార్గంబని తలచె
యశంబుకాదు నోరులేని జీవుల వధించుట
యుక్తమా అని కొంత సందేహము మాత్రము కలిగె 236

బింబిసారుని సభామందిరంబు సిద్ధార్థుడు వీడి చనగ
భూపాలుని నగరవాసులు యజ్ఞశాలకు వచ్చుచుండ
భూపాలుడొకచో నాసీనుండై యజ్ఞము సలుప శాసించుచుండె
భూసుర రాజపురోహితుడు వచ్చె యజ్ఞ పశువులచటికి తేబడె 237

విప్రవర్యులనేకులు మంత్రముల పఠించుచుండ
విలంబనలేక హోమాగ్నిని ప్రజ్వలింపచేసి
వివిధ సుగంధ ద్రవ్యము లందు వేయుచుండె అగ్నిహోత్రముకడ
విప్రుల సమక్షములో యజుర్వేద మంత్ర పఠనంబు చేయుచుండ
వధింపుడని రాజు పలుక అధ్వర్యుడొకండు ఖడ్గము చేబూని
వధింప ఖడ్గము పైకెత్తె అంతలో నా సిద్ధార్థుండు
వడివడిగ హఠాత్తునవచ్చి యజ్ఞశాల దద్దరిల్లగ
విప్రులదరి పోయి యిట్లు ఘోషించె ఆగుము ఆగుము వధింపకుడనియె
విశాల యజ్ఞశాలయందున్న సమస్త జనులనుద్దేశించి యిట్లు పలికె 238

అప్పలారా! నీచపనులందరు చేయుదురే మంచి పనులను చేయలేరు
అందరు నిర్దయులై నోరులేని జీవులను సంహరింతురే
అగుపడరు వానిని రక్షింపు సుజనులు జీవహింస
అనునిత్యం యొక నిత్య కర్మగా యెంచుకున్నారా 239

మనుజులు దోషరహితమగు జీవముల వధించువారు
మహా హంతకులేసుమ్మి సర్వేశ్వర శిక్షకు వారు పాత్రులె
మోక్షమున కెట్లు వారు పాత్రులు? ఆలోచింపుడు
మహేశ్వరుని దయా కరుణల కెట్లు పాత్రులౌదురు మీరు
అహింసానుష్ఠాన వ్రతముకన్న వేరు ధర్మమున్నదా! 240

అహింసానుష్ఠానము కన్న మించిన ధర్మము లేదని
అన్న పూర్వ ఆర్యశాస్త్రములు ఘోషించుచుండ
అశాస్త్రంబైన యీ జంతుబలితో మీరు మోక్షమెట్లు పొందగలరు?
అహింసా పరమోధర్మహః అనుశాస్త్రోక్తమును
ఆర్యులెపుడో ప్రకటించినది మీకు తెలియదా? 241

హింసాపరుడైన నరుండు స్వప్నమందైనను సుఖంబు బడయలేడు
హింస ఐహికాముష్మికా సౌఖ్య సంపాదన కాటంకమే
సమస్త మానవులు పశుపక్ష్యాది జీవకోటితో
సహాయము పొందుచూ వానిని చంపుట న్యాయమా? 242

ప్రపంచ భ్రమకు చిక్కియున్న
ప్రతి ప్రాణి జీవంబు మధురంబుగా నెంచు
ప్రాణ విసర్జనంబన్న చీమ మొదలు యేనుంగువరకు
ప్రాణి మహాభయ విషాదంబొందు 243

అల్పప్రాణి బలముగల ప్రాణికి చిక్కి మరణించు
బలముగల మానవజాతికి పశుపక్ష్యాది జాతులు
బలియగుచుండ లేదా? సహనము లేనివాడు
అలరారునా మానవుండుగా? గ్రహించుడు
బలము నోరులేని జీవజంతువుల వధించుట న్యాయం బెట్లగు? 244

మనకు హింసలు రెండు విధంబులు సుమ్మి
మనకు బహిర్గతముగా కన్పించున దొక హింస యనంబడు
మానసిక అంతరంగ హింస యనునది మరొక హింస
మారణ ఆయుధంబున శత్రువును ఖండించుట మొదటి దౌను
మనుజుల మాటలతోను చాటుమాటు చెరుపు పనులు
మనుజులకు చేయుట రెండవతీరు హింస యగును అన్నలార 245

హింసకు హేతువు రజో తమో గుణంబులె
హింసభావము నశింప సత్త్వంబు పెంపొందవలయు
హింసయే సర్వపాపంబులకు మూలంబౌనుసుమ్మి
హింసచేతురు కొందరు యజ్ఞయాగాదులని
హింసచేతురు కొందరు దేవతలకు సమర్పణంబని
హింసచేతురు మరికొందరు ఆహార బలంబునకని
హింసచేతురు మరియు కొందరు రోగ విముక్తంబునకని
హింసించు చున్నారిట్లు పశుపక్ష్యాదుల బలిచేయుచు
హింసా విధానంబు అవివేకముతప్ప వేరొండుగాదు
హింసించిన వెంటనే శిక్షించబడకున్నను
హింసించిన నరుడు పరమేశ్వరునిచే తప్పక శిక్షించబడుసుమ్మి 246

బింబిసార నృపాలుండొక్కసారిగ విధేయ భక్తి ప్రపత్తులతో
సంబర ముఖారవిందముతో " మహాత్మా క్షమింపుడు
మీనోట వెలువడిన వేదవాక్యంబులచే
మీ అపార దయాకరుణాంతరంగ భావ పలుకులచే
మేము ధన్యులంబైతిమి నా పూర్వులు జ్ఞానదూరులై
మానవధర్మంబు యజ్ఞ యాగాదులు చెయుటేయని తలచి
మాకు బోధించియుండు కతన యీ ఘోర భయంకర
మహా పాప కార్యంబగు యీ జంతుబలికి పూనితిమి
మేమిట్టి పాపులగుటకు తప్పుడు వేషధారుల ఉపదేశంబులే 247

మూలంబై వివేకశూన్యులంబై యీ అంధకార మయంబగు
మానవ వినాశ హింసామార్గంబనుసరించి పరమనీచులమై
మహాత్మా మా సంసారంబులు పాప సాగరంబులయ్యె
మన్నించి మము కాపాడుము మహానుభావా
మీ యుపదేశమె మాకు శిరోధార్యంబై
మరిమరి మీ బోధామృతంబుగ్రోలి
మా జన్మంబు సార్థకంబై పరమేశ్వర ప్రేమకు పాత్రులముగ
మమ్ము నడపించి కాపాడుము ఇకనీ వాక్యమే మా ప్రాణంబనియె 248

"ధరణీపాలా పరస్పరాసూయాగ్రస్థులై
పరధనాకాంక్షా ప్రేరితులై
పరరాజ్యాపహరణాసక్తితో యుండుట
నరకమునకు హేతువేగాని వేరొండు కాదు సుమ్మి
దురాచారములబాపి సర్వత్రా శాంతమును నెలకొల్పి
సర్వేశ్వర భక్తిని నిరంతరంబు ప్రబోధ గావించుచు
ధరణి నేలుటే ధర్మంబౌను రాజులకెల్ల" 249

సిద్ధార్థుండు కొందరు ఋషులను చేరి జ్ఞానం తెలియుట

అటనుండి వెడలి సిద్ధార్థుండు చేరె వైశాలినగర
అమల హిరణ్యావతీ నదీ ప్రాంతంబు
అచట ఆకాడకాలామను పేరుగల శాస్త్రజ్ఞుండగు ఋషివర్యుని
అనంతరము రామపుత్ర ఋషివర్యుని చేరి
అహర్నిశలు వారిని సేవించుచు సకలవిద్య లామూలాగ్రంబుగ నేర్చె
అత్యంత భక్తి శ్రద్ధలతోడ నుత్తమ జ్ఞానంబు బడసె
ఆ ఋషివర్యుల జ్ఞానంబు చాలదని వారిని బహిష్కరించి
అధ్యాత్మిక జ్ఞానార్జనకై సిద్ధార్థుండు ఏకాంతనిష్ఠకై
అరుద్రకుని యేవురి శిష్యులతో యటనుండి వెడలె
అందుకు తగు స్థలాన్వేషణకై వెదకె గయాశీర్ష పర్వత సమీపాన
అమోఘ నిరంజనీనది ఫల్గునదితో కలియుచోట చేరె
ఉరబిల్వ మనుపూరు 250

సిద్ధార్థుండు ధ్యానమునకు మారుయోగముచే సాధింపబూనుట

జనన మరణ అగాధ సాగరంబునువీడి
మాననీయ జీవకోటి నిర్వాణ పథంబుచేర
పంచభౌతిక కాయంబు ధ్యానంబు మాని సిద్ధార్థుండు
ప్రగాఢ యోగసాధనంబున దేహము తన స్వాధీనమౌరీతిగ
అమోఘ యోగసాధనంబు చేసె
అన్న పానీయాలాసించకుండ 251

అచంచల యోగసాధనతో గడిచె
అనేక దినములు పక్షములు మరియు మాసంబులు
కాని భోజన పానీయాదులం దనురక్తిలేక
కాలంబు గడిచె వత్సరంబులారు 252

బాహ్యప్రపంచ జ్ఞానంబు నశించె
భయ విషాదంబులు నశించె
సిద్ధార్థుని సువర్ణవర్ణ రంజిత శుభగాత్రము
సన్నగిల్లె వికాసహీనమై
శూన్యమయ్యె చేతనంబు
శుష్కించె కాయంబు లేదాయె శక్తిపటిమ
కదల మెదలని దుర్బలుడయ్యె
కాయంబందు యెముకలు గూడు మిగిలె
కాని చిరవాంఛిత బోధిసత్వ జ్ఞానంబు
కలుగలేదు సిద్ధార్థయోగికి 253

ఏతత్సాధనా ప్రభావంబుచే
ఏకంబుగ కఠోర తపంబాచరించినగాని
నిజవిషయ వాసనల జ్వాలలు నశింపవయ్యె
నిజజ్ఞాన ప్రకాశము కనబడు టసాధ్యమయ్యె 254

తన ముక్తి మార్గాన్వేషణంబిసుమంతయు కానరాదని గ్రహించె
తదాదిగ యథోచితాహార స్వీకారమే
తనకు ముక్తిమార్గాన్వేషణంబని విశేష ప్రయోజనంబని
తానాహారము విస్మరించు టెంతయు హానికరంబని
తాను తెలిసికొని ఆయోగమునుండి లేచిపోవ 255

తనకు శక్తిలేక వృక్షశాఖల పట్టి ప్రయత్నించి లేచివచ్చె
తాను ముందున్న వృక్షము చెంతకు నడచిఅరుగనెంచి
తాహతులేక మూర్ఛితుడై నేలంబడియె
శిష్యులంతట గురుదేవుని వెదకుచు వచ్చిరి ఐదుగురు
శిష్య పంచకంబు సిద్ధార్థుండు మరణించెనని
అతని మృత్యువున కాయన తపోభంగమె కారణంబని
అట నిక నుండరాదని చనిరి నూతన గురువుచేర తలచి 256

## సిద్ధార్థుడు గోపాలునితో మాట్లాడుట



ఆ మార్గంబున నొక గొల్లబాలుడు
అతని మేకలమంద నా మార్గంబున తోలుకొని
అరుగుచుండి కనియె నా సిద్ధార్థయోగిని
అపుడె మందలోని కరిగి నొకమేకను తెచ్చి
ఆ సిద్ధార్థుని నోటిలోపడ పాలుపిండ
అప్పుడతనికి బాహ్యస్మృతి కలిగె మెల్లగ కనులు తెరచె
అచటున్న గోపబాలుని చూచి సోదరా
ఆకలి బాధచే పీడింపబడుచున్ననాకు
ఆ నీచేతనున్న మట్టిపాత్రతో పాలద్రావించి రక్షింపుమనియె 257

మహాత్మా నీ వగ్రజాతివాడవు అందునా మహర్షివి
మదీయ కులమొక నీచనీయంబు
ముంతలోని పాలను నీ కొసంగిన బడయుదు నే నరకంబు
మిమ్ము తాకుటయే ఒక మహా పాపంబగునని
మేక చంటిపాలనందుకే నీ నోటియందుపడ
ముదమార పిండితిని కానీ యివ్వజాలను నీకీ ముంతను మహాత్మా 258

పుట్టుకచే జంధ్యముతో
పుట్టుకచే నొసట కుంకుమ బొట్టుతో
పుట్టలేదెవరు నుర్విలోన
పురుష స్త్రీ భేదంబులు రెండుమాత్రమె లెక్కకు
పుణ్య గోపబాలకా సహోదరా తెలియుమయ్యా 259

గన్నేరు పుష్పంబు గులాబివలె ఘుమాళించు
కనలేము కాని అల్పముదైన
గన్నేరు పుష్పంబు సృష్టి
కలిగె యీశ్వర సంకల్పంబు తోడనె కదన్నా 260

ప్రేమ దయాకారుణ్యాల మానవుండె
ప్రేమమీర బ్రాహ్మణుండగు డెవ్వరైన
ప్రేమ లేనివాడు బ్రాహ్మణుండు కా డెవ్వరైన
జన్మచే గర్వించగరాదు బ్రాహ్మణుండైన
జంధ్యముచే నెవ్వరును జన్మింపగలేదిలలోన 261

సోదరా జన్మతోడనె యుత్తము డధముడని
సాదరంబుగ తెలియరాదు
సోదరా యీ దేహమొక మురికిగుంట
సోదరా అవయవములన్నియు దుర్గంధ పూరితంబులే
సోదరా యీ దేహచర్మము ఒక మెరుగుపూత
సోదరా ముక్కునుండి చీమిడి కారుట చూడలేదా
సోదరా చెవులనుండి గుమిలి నేత్రములనుండి పిసరు
సోదరా ముఖము నుండియు పాచి రోమాదులనుండి చెమట
సోదరా ఆసనమునుండి ఆహారము కల్మషమైవచ్చు చుండలేదా
సోదరా మరియు మర్మేంద్రియాల నుండి అల్పాచమానము
సోదరా స్త్రీ మర్మేంద్రియంబునుండి వెలువడు రజస్సుమండియే
మన యీ దేహంబు కల్గు
సోదరా యింతటి దుర్గంధపూరితంబు
సకల రోగపూరితంబు అసహ్యంబు
సోదరా అశాశ్వితంబీ శరీరంబని తెలియుమోయి 262

సంతరించుకొను జ్ఞానమ్ము మానవ ధర్మంబదియె సోదరా
సంప్రాప్త శరీరము మనదికాన
సద్గుణమే గౌరవానికి కారణంబుకాని కులముకాదు
సృష్టిలోని ప్రతిపదార్థ ముపయోగపడునదే సోదరా
సృష్టిలోనున్నదంతా సర్వేశ్వరుని మయమే సోదరా 263

అన్నా మరణావస్థయందున్న నన్ను బ్రతికించి
అగ్రశ్రేణి బ్రాహ్మణుండవైతివి
నీదగు కరుణాంచిత హృదయమే
నిన్ను బ్రాహ్మణుండుగా చేసినదదియే
దయా మమకార సంభూతుండు కానివాడు
ధాతకాలేడు సుమా నీవే నా ధాతవు 264

సహోదరా పరోపకారగుణమే శ్రేయంబు
సంసారులు భ్రష్టులై జ్ఞానదూరులై
సంచరించువారు మిథ్యాభిమానులె సుమ్మీ
స్వభావంబున నీవే ద్విజుడవు
సదసద్వివేకుండవై ఈశ్వర ప్రేమికుడవు నీవె 265

గోపాలబాలుండా మహాత్ముని హితబోధ నాలకించి
గుప్తమగు జ్ఞానోదయాన్ని పొంది యొసంగె తన పాలముంతను
గోలె నందున్న పాలను ఆ సిద్ధార్థుండు
గోపాలుండు వెడలె వికసిత సంతుష్టాంతరంగుడై 266

## సుజాతాదేవి సిద్ధార్థునిపై చూపిన పవిత్ర భక్తి

సిద్ధార్థుండచటినుండి లేచి పోయిచేరె తన నిజకుటీరంబు
సుజల హిరణ్యవతీ నది నావలి వొడ్డును చేరె సిద్ధార్థుండు
సద్గుణ ధనవంతుడొక డచట భార్యామణి సుజాతాదేవితో
సర్వ పేదలకు వికలాంగులకు దిక్కు లేని వారలకెల్ల
సంపాదిత ధనంబును నిత్యంబు దానంబుచేసి
సర్వేశ్వరుని వేడుచుండిరి తమకొక పుత్రసంతానంబిమ్మని 267

సంతానము బడసె నా సుజాతాదేవి
సంశోభిత పుత్రుని ప్రసవించి ముదమొందె
సత్యసంధులై ఆ దంపతులు సమీపాటవి దేవతకు
సమర్పించ సిద్ధులైరి సువర్ణపాత్రతో క్షీరాన్నంబుతో 268

పరిచారికను బంపె నా సుజాతాదేవి రాధను
పరిసర కదంబవనంబందున్న ఒక వృక్షముచేరి
పరిశుభ్రంబుచేసి రమ్మటయన
పరుగున యామె యా వనంబుచేరి
ప్రముఖమైన నొక గొప్ప వృక్షముచేరి చూచె
ప్రభాసితుండైన మోకాళ్ళపై నిజకరంబు లిడుకొని
ప్రమోద భగవధ్యానము చేయుచుండెనొక దివ్యరూపులో 269

సందర్శించు వారి కతడొక సిద్ధుండో లేక వసుధలో
సంస్కరించ జనించిన సర్వేశ్వరుడో యనునట్లుండె
సిద్ధార్థుండు నిమీళిత నేత్రుండై తేజఃకాంతులతో యుండ
సరగున యీ రాధా మహాత్ముగాంచి ఆనందాశ్చర్యాలతో
సుజాతాదేవి కడకువచ్చి తెల్పె తనుకన్న యీ వింతనెల్ల 270

శుభప్రదంబని తన బాలునితో యీ సుజాతాదేవి పూజాద్రవ్యాలతో
శీఘ్రంబుగ నా వనంబుచేరె సువర్ణపాత్రతో క్షీరాన్నంబుతోకూడ
శ్రేష్ఠా! ఓ దివ్య పురుషా! యని భయభక్తులతో సాగిలబడి
శ్రేయంబు కలుగమమ్ము దీవించుము యీ అల్పాహారంబు
శంకించక అరగించి మమ్ము ధన్యుల చేయుమని వేడె 271

క్షీరాన్నంబున్న యీ సుజాతాదేవి సువర్ణపాత్రనిచ్చె
క్షీరాన్నపాత్రను మారుపలుకక సంతోషానందముతో అందుకొని
క్షుధార్తి పూర్ణంబుగా దొలగునట్లు ఆరగించె సిద్ధార్థుండు
క్షయంబయ్యె వెనుకటి ఆకలిబాధ పూర్ణంబుగ
క్షోభ ముఖారవిందంబునుండి వెడలె నొక నూతనకాంతి 272

ఆ దేవి అంత కరద్వయంబు జోడించి ప్రార్థించె నిట్లు
ఆనందకరమౌ నిను గాంచి ధన్యత నొందితి నేను
అనవరతంబుగ నేను కొల్చితి నందు కరుదెంచితీవు
అనంత బాధల భ్రమలందున్న మానవుల బ్రోవ
అరుదెంచితివి మహాత్మా నీవు మానవ దేవతవు
ఆరగించితివి నే నిచ్చిన అల్పాహారంబు బాగున్నదా స్వామీ 273

ఓ ప్రియ నా సహోదరీ నేను దేవుడను కాను
ఓ ప్రియ నా సహోదరీ పురాణ పురుషుండను కాను
ఒక సాధారణ మనుజుండనె నేను
ఒప్పుగ సత్య మార్గంబు నన్వేషింప సాధన చేయుచున్నవాడను
ఓ ప్రియ నా సహోదరీ నీ ప్రియ తనయు నిట కొనిరమ్మనియె 274

ఆ అర్భకుని శిరముపై తన దక్షిణహస్తముంచి సిద్ధార్థుండు
అనంతానందముగ నుండునట్లా బాలుని దీవించుమని
ఆ సర్వేశ్వరుని నిమీళిత నేత్రుడై ప్రార్థించి నిట్లనె
"అమలానంద సహోదరీ నిత్యానందముకై జపతపంబులు చేసియు
అందుకొనలేకున్నాను పూర్ణంబుగ నేను 275

నీవన్నో విషాద మిసుమంతయు లేక
నిరంతరంబుగ ఆనందముఖారవిందవై
నిత్యానంద భరితంబుగ శోభిల్లుచున్నదానవు
నీ యీ సంపూర్ణ సంతుష్టి యెట్లు యీ భువిలో
నిల్పుకొని జీవనంబెట్లు చేయుచున్నదానవో
నిగూఢంబేమిటో నాకు తెల్పుమో సహోదరీ" 276

సిద్ధార్థుండు సంసారులవలె తినుచుండె నాహారంబని
సమీపారణ్య జపతపాదులుచేయు నిస్సంగులు
పూర్వపు తన యేవురు శిష్యులు అటుచేరి
పుష్కలఆహారంబారగించుట కామక్రోధాదులు పెరుగునని
పలువిధంబాతని నిరసించి పరిహసించ 277

అపుడా సుజాతాదేవి యిట్లు పలికె
"అనుకూలంబులు ప్రతికూలంబులు నాకు లేవు
అన్నియును మనమేలునకేయని తలంతు
స్వార్థము వీడుటయే పరమార్థమని నమ్మెద
సంతోషానందములతో సర్వేశ్వరు నారాధింతు
జయాపజయంబులు లేవు జగంబున యని నమ్మెద
జగదేకస్వరూప పరమాత్ముడే కావగలడని నమ్మెద
మరణంబు నాహ్వానింతు నేను ప్రేమతో
మననంబున సుఖదుఃఖముల సమంగ చూచెద 278

నాకు పుత్రుడు ప్రాప్తించ వేడితిని కాని
నాకు పుత్రప్రాప్తి కలుగకున్నను శోకించను
నే నీ లోకమునకన్న పరలోకమునందే విశేషానందంబని
నిజంబుగ నమ్మెద జ్ఞానమార్జింపని వారికి
నిజంబుగ నిర్వాణముండక పునర్జన్మయే వారికి శరణంబనియె" 279

"సాధ్వీమణీ నీ హితోపదేశంబు మానవుల కెంతయో శ్రేయంబగు
సహోదరీ నీవు వివేకులకు వివేకంబు బోధించుచున్నదానవు
సర్వేశ్వర కృపాకటాక్షవీక్షణ ప్రభావంబు నీపై నింపారపడి
సర్వదా మనశ్శాంతితో నీవు శాశ్వతానందంబుతో ముక్తిపొందెదీవుగాక"
"సత్యధర్మజ్ఞాన సంపన్నుడై, నిస్సంగుడై స్వార్థదూరుడై
స్వీయ జీవితంబు ప్రపంచ హితార్థమై నీ పుత్రరత్నంబు
స్థిరచిత్తుడై సంచరించి చరితార్థుడగు గాక" 280

## బోధివృక్ష మహిమ
## (రావిచెట్టు)



బోధివృక్షము క్రింద పరుండి సుజాత మాటల
బోధనలోని మర్మము లరయుచుండ
ఆ మార్గంబునపోవు వేశ్య కాంతలు వీణ వాయించుచు
అతియెక్కువ స్వరములో తీగను మీటరాదంచు
అతితక్కువ స్వరములో మరియు వీణ తీగను
మీటరాదనుచు యెక్కువ స్వరంబు విన
మరియు హేయంబుగా నుండు
మరియు తక్కువ స్వరంబులో మీట విన వీలుకాదుగ యని
మీటవలె తగు మోతాదులో మధ్యస్థంబుననే వీణ తీగను
మీటుచుండుటే శ్రేయస్కరంబు వినుడని
వారకాంతలలో నొకర్తె విశదంబుచేసె
వినంబడె వారి వాదనలా సిద్ధార్థ యోగికి 281

రాకుమారుడు సిద్ధార్థుండట్లు సుజాతాదేవిని సాగనంపి
రాగద్వేషాల కతీత మగునట్లు వికసించె హృదయంబు
బలహీనమైయున్న శరీరంబు బలవంతంబయ్యె
భూమ్యాకాశంబులు రెండును కరతలామలకమైనట్లు
మానసిక దృష్టి వికసించి సత్యజ్యోతి ప్రత్యక్షంబయ్యె
మహనీయ పరిశుద్ధ సాధనాశక్తి యినుమడించి
దేహమును బలాన్వితంబు చేసికొనుటయే ప్రధానంబనియె
దేహమును కఠోర సాధనంబునగాని
తగు యాహారంబు తీసికొనకుండుట సరికాదనియె మరియు
తగు సమయంబందాహారము తప్పక గ్రహించితీరవలెనంచు
మానసంబు దృఢతరంబుగా నుండవలెననియె
మది చైతన్యశీలమైయుండు మార్గంబవలంభించుటే విధియని
మరియు నాహార పానీయంబు లారగించ మొదలిడి
మరియు సడలిన దేహపటుత్వంబును తిరిగి పొందె 282

మధ్యే మార్గంబనుసరించియే జ్ఞానంబు
మనుజులు పొందవచ్చునని తన యనుభవంబు
మదినెంచి శరీరపటుత్వము తప్పకుండునట్లు తోచి
బహుకఠిన వ్రతంబుగా ఆహారపానీయములు మాని
బలహీనమై యుండ జ్ఞానంబు పొందరాదని
బలమైన ఆహారంబు నిరంతరం తినుటతో మరియు జ్ఞానంబు
పొందరాదనియె 283

సర్వసందేహముల బాసి
సచ్చిదానందస్వరూప నిర్వాణము పొందు
సిద్ధి లభించు సకాలము త్వరలో తనకు
సంతరించనున్నదని తెలియవచ్చె
సాధనంబు మొదలిడుమని
సిద్ధార్థుని అంతరంగంబాజ్ఞాపించె 284

ఒకనాడా సిద్ధార్థుండాతడున్న బోధివృక్షము క్రింద
ఒనరగ ఆకులలములపేర్చి సూర్యాస్తమయంబున
ఒక ఆసనంబు కూర్చుకొని ఆశీనుడై
ఒక ప్రతినబూని యిట్లు ప్రకటించుకొనియె 285

"నా ఈ శరీర మాంసము, యెముకలు, చర్మము
నాశనమైనను కల్పాంతమైనను దుర్లభమగు
బుద్ధిని సిద్ధిని
బడయనిదే నేను యీ
బోధివృక్షము నుండి లేవబోను" 276

సిద్ధార్థుడట్లు దృఢసంకల్పుడై
సాధనా సింహాసనుడై శరీర సంరక్షకుడై
సాధనా సంగ్రామోన్ముఖుడై
సాధనంబందు లగ్నమనస్కుడై
పాపరహితుండై విలసిల్ల
పాపలాలస హృదయాంతర్గతమైయున్న
మానసిక దౌర్బల్యాలన్నిటిని సమూలంగా పెకలించి
మహిమాన్విత బుద్ధితో సంసిద్ధుండయ్యె 287

మేరుపర్వతము స్థానభ్రంశమైనను
మదీయ సంసార*మంతయు శూన్యమైనను
మాననీయ ఆచంద్రతారార్కంబవనిపై రాలినను వేయేల
మహాసాగరంబు లింకిపోయినను
మదీయ యీ సాధన చేయు యీ బోధివృక్షంబు నుండి
మరెవరును వేరుచేయజాల రనియె 288

* తల్లి తండ్రి భార్య కొడుకు రాజ్యము మరియు తాను
సర్వాల నశించినను

## బోధివృక్షము క్రిందనున్న బుద్ధదేవునికి జ్ఞాన దర్శనము

సర్వ సుఖాభిలాషయే దుఃఖహేతువని తెలిసె
సమస్త ప్రాణుల జన్మకూడ పాపహేతువని తెలిసె
విషయ వాంఛలే మృత్యుకారణంబని తెలిసె
వివిధ కాంక్షలే పునర్జన్మ కారణంబని తెలిసె 289
ధర్మమే సత్యంబని సిద్ధార్థుండు బుద్ధుడై పలికె
ధర్మంబె ప్రపంచ మనుగడకు కారణంబనియె
భ్రాంతి దుఃఖభయంబులే మానవుల
శాంతిలేమికి నిత్యసత్యంబని కలిగె జ్ఞానంబు
స్వేచ్ఛలేని బానిసభావ బంధనంబునుండి
స్వేచ్ఛను బడయుటే మానవ నిర్వాణ పథంబని తెలిసె 290

### పై విధ జ్ఞానముతోపాటు బుద్ధునికి క్రింది అష్టాంగమార్గము బోధివృక్షము క్రిందనే తెలిసినది

. సర్వప్రాణులను సమదృష్టితో చూడుము
2. సర్వప్రాణులు క్షేమంగాయుండునట్లు చూడుము
3. సర్వప్రాణుల క్షేమాన్ని కాంక్షించుము
4. సర్వప్రాణుల క్షేమా కర్మలేచేయుము
5. సమమైన తక్కువకాని లేక ఎక్కువలేక స్థిరమైన వ్యాయామము చేయుము.
6. సర్వప్రాణులను బాధించని పనులను చేయుము
7. సర్వులు క్షేమంబుగానుండు పనులు చేయుము
8. సర్వులు ఆనందించుటయె తన యానందమని తెలియుము 291

ఆర్య సత్యచతుష్టయ ధర్మాలె
ఆ అష్టాంగమార్గ విధానంబు
దుఃఖము దుఃఖోదయ కారణంబు
దుఃఖ నాశన మార్గంబు తెలియవలయు
దుఃఖ నివారణోపాయంబు తెలియవలయు 292

## అష్టాంగ మార్గ విధులు

1. సమ్యగ్దృష్టి 2. సమ్యక్సంకల్పము 3. సమ్యగ్వాణి
4. సమ్యక్కర్మాంతము 5. సమ్యగ్జీవనము 6. సమ్యగ్వ్యాయామము
7. సమ్యక్స్మృతి 8. సమ్యక్సమాధి 293

జననమే దుఃఖ హేతువగును
జరావ్యాధులందు దుఃఖముండితీరును
జనుల కేది ప్రియపదార్థమో నదియె దుఃఖకారణంబు
జనులకెద్ది అప్రియమో నదియు దుఃఖహేతువె
మనుజుల తృష్ణయే దుఃఖము తెచ్చిపెట్టును
మనుజులు కోరికల విసర్జించి తీరవలయు
మనుజులకు దుఃఖము లేకుండయుండ
మహత్తరమైన అష్టాంగ విధానంబె శరణంబనియు
మహాత్మ గౌతమబుద్ధునికి బోధివృక్షము క్రింద
మరణ జనన రహస్య జ్ఞానదర్శనంబయ్యె 294

బుద్ధుని హృదయాంతరాళంబునుండి వెలువడె
భావోద్వేగ పిలుపు అతని కిట్లు తెలియచేసె
''భవదీయ జన్మ మూర్తీభవించిన 'సత్యమే'
భువిపై అవతరించిన ఆదిశక్తివీవు
భువిలో మానవరూపమందున్న సచ్చిదానందమూర్తివి నీవు
భువిపైయున్న దుష్టమార్గమునెల్ల ఛేదించి
బాధింపబడని జీవకోటి ధర్మప్రపంచ మావిర్భవించ తగు
భువిపై ప్రబోధ ధర్మప్రచారము నీవు చేయుము'' 295

ఆరు సంవత్సరాల కఠోర సాధనచే సాధించె అమృతత్వం
ఆ బోధివృక్షము క్రింద కటిక నేలపైయుండి సాధించె
అమరత్వ మార్గంబు బోధివృక్షము క్రిందనె
అనంత కఠిన జీవసంసార సాగరంబుదాట
అఖిల జీవుల శాశ్వితానందమయ లోకము సృష్టించ
అమృత జ్ఞానమయ నిర్వాణపథంబులో పయనించు
అమోఘ జ్ఞాన దర్శనంబందుకొనియె
ఆ బోధివృక్షంబు క్రిందనె
ఆహా ఆ వృక్షమెంత మహితాత్మయో
అర్పించవలయు నమోవాకంబు లుర్విలోని
అనంతప్రాణికోటి ఆ బోధివృక్షానికి 296

## బుద్ధదేవుడు నవ్యధర్మ ప్రబోధము చేయుటకు ఉద్యుక్తుడైన విధము

తన నవ్యజ్ఞానంబు ప్రబోధించ తలంచి
తానున్న బోధివృక్షంబు వదలి లేచి
తన్నొడబాసిన వెనుకటి యేవురు శిష్యులను వెదక
తక్షణమే బయలుదేరి సంచరించుచుండె 297

అట్టితరి యా యడవులందున్న ఋషులు గేలిచేయ
ఆ సిద్ధార్థుండు తపోభ్రష్టుడై విషయ లంపటుడై
అట్లు సంచరించుచున్నాడని ఋషులు పల్కుచు
ఆతని కాథిత్యముగాని గౌరవంబునుగాని యివ్వవలదని
అసూయ ద్వేష భాజనులై మెలంగిరా యటవి మునులు 298

బుద్ధదేవున కగుపడిరి తన శిష్యపంచకంబు నా ప్రాంతమందె
బుద్ధదేవుని సుప్రసన్న వదనారవిందజ్యోతిని గాంచినంతనె
బుద్ధివచ్చెవారికి ఆయన కడమోకరిల్లి వెంబడించిరి
బోధింపుము మా అజ్ఞానంబు విడిపోయి సుజ్ఞానంబు కలుగ మాకని
బుద్ధదేవుని వారు వెంబడించి రానందముతో 299

శిష్యులవెంట నిడుకొని ఒక సరోవరంబునుచేరి
శిష్యులనందు స్నానమాచరించుడని తెల్పి
శిష్యులారా నేటి స్నానము నిత్య స్నానము వంటిదికాదు
శుద్ధమానసంబునకై స్నానంబిది సుమా 300

ఓ కుమారులారా! త్రివిధములవంటి శిష్యులు లోకమందున్నారు
ఒకశ్రేణియై తిరగబడిన కుండవంటివారు
నీటిలో బోర్లపడియున్న కుండవలె రెండవశ్రేణియై
లోకమందు ఊర్ధ్వముఖంబుతోనున్న కుండవలె మూడవశ్రేణియై
చక్కని యుత్తమంబగు శిష్యులా మూడవ శ్రేణివారు 301

తిరుగబడియున్న కుండలోనికి నీరుపోయి పోనట్లుండు
నీరు అట్టి కుండలో యెంతయో నిలువదు కదా
నీరు బోర్లయున్న కుండలో ఉన్నట్లేయుండి
పరులా నీటిలోని కుండను పైకెత్తగానె
నీరు క్రిందపడిపోవుకదా ద్రావ వలనుపడదు
తరువాతి తృతీయశ్రేణి కుండ మూతి ఊర్ధ్వముఖమైయుండి
తరుగులేక నీటితోనిండి నిలిచియుండు
కోరుకొని యుపయోగించవచ్చు యే కాలానికైన 302

తెలియుడీ గురుశిష్య జ్ఞానసంబంధ సూత్రంబు
తెలివి యుండునే గాని ఆచరణంబు లేనిచొ
మలినమౌ జ్ఞానంబు మనుజులందు
తెలియుడో వత్సలార యీ జ్ఞానరహస్యంబు 303

శిష్యులేవురు తాము ఉన్నత తృతీయశ్రేణి శిష్యులమై
శోభిల్లగ మెలంగెదమని ప్రమాణ యుక్తంబుగ
శాశ్వితోత్తమ జ్ఞానంబుతోనుండ శపథంబు జేసిరి
శాంతి వ్యాపింపచేయు జ్యోతులై వెలుంగ 304

గురుదేవుని నవ్యమార్గ మష్టాంగ మార్గ మనుసరింప
తరుణ జ్ఞాన సిద్ధి దృష్టిని, సంకల్పంబును
కరుణవాక్యంబును కర్మను, జీవితాన్ని తగు విధంబున
జరుపు వ్యాయామాన్ని మరియు స్మృతిని ధ్యానంబు
మరువక సలుపవలయు మాననీయ జీవితంబని
మరిమరి పరివర్తనులై నేర్చిరి సాధన గురుదేవుని అష్టాంగ మార్గంబు 305

జనపథ మధ్యంబున ప్రబోధముసేయుచు తాను శిష్యులతో
తన నూతన సత్యధర్మ ప్రచారముతో చనుచుండ
అనేకు లసూయపర తాపసులడ్డుపడి అజ్ఞాన ప్రశ్నలడుగ
మానసంబు నొచ్చుకోక శాంతియుత వచనంబుల జవాబులిచ్చి
జనవాసంబులందు మహాత్ముడు బుద్ధుడు తిరుగుచుండె 306

మానసంబే దివ్యమగు క్షేత్రంబనుకొను మోయి
మాననీయహలమే ధర్మాచరణంబోయి
నమ్రతయే జ్ఞానంబు బడయుటే
నాణ్యమైన దుక్కి దున్నినట్లు
నిరంతర కృషిచేయుటయే వృషభ ద్వయంబగు
సత్యంబే ములుకోల యగు
నిత్యశ్రద్ధయే విత్తనంబులగు
సత్కార్యంబు సలుపుటయే వర్షించినట్లు
సస్యతతిని నాశనమొనరించు కలుపే మోహంబు
సత్యత్యాగములే సస్యశ్యామల ఫలింపచేయు
సచ్చిదానంద నిర్వాణమే ఫలసాయంబగు 307

శ్రావస్తి నగర ప్రాంతాన కృష్ణాదేవి అనునామె బోరున ఏడ్చుచూరాగా

ఒక్కపారిగ వచ్చి ఆమె బుద్ధుని పాదంబులపై పడగ
అక్కరోయెందుకేడ్చెదవమ్మ యేమి నీయాపదనగ 308

ఒక్కగానొక కొడుకుండె నాకు మహాత్మా
ఒక్కడు లేకుండ మరణించె మహాదేవా
మాణిక్య వైడూర్యాది కనకంబులిత్తు నీకు
మృతుండైన నా కొమరుని బ్రతికించుమయ్యా లేదేని
మరణించ నుద్యమింతు నేనునుదేవా 309

అంతటామెను మందస్మిత వదనారవిందుడై తల నిమిరి
"అమ్మా తల్లీ సర్వసంగ పరిత్యాగినైన నా కెందుకావజ్రవైడూర్యాదులు
అలసింపక తెమ్మా కొన్ని నువ్వులు మాత్రమే
ఆ నువ్వులు యేయింట యెవరును యెపుడును మరణంబులేనియింట
అరుగుము తెమ్మా సత్వరంబె కుమారీ" 310

వెంటనే యా కృష్ణాదేవి రివ్వున ఆ నగరిలోని కరిగి
వేగంబుగ ఇల్లువదలి ఇల్లు మరణంబులేని ఇల్లు వెదకుచూ
ఎంతో ప్రయాసతో వడివడిగ వెదకుచు
ఎంతో ఔత్సుకతో తిరిగి తిరిగి అలసి సొలసి గుర్తించె 311

ఒకయింట పితామహుండు మరణించెనని
ఒక యింట తండ్రి మరణించెననియు
ఒక యింట భర్త మరణించె మరియొకచో తల్లి మరణించె
ఒకయింట తమ్ముడు మరొకచో అన్న గతించె
ఒక్కొకచోట ఒకరు మృతిచెందిన నివాసంబులే
ఒనరుగ కన్పడ నామెకు వెంటనే నామె వట్టి చేతులవచ్చె 312

ఓర్చుకొనలేక వ్రాలె మహాత్ముని పాదముల చెంత ఘొల్లున యేడ్చుచు
ఓ దేవా ననుక్షమించు నేను తేలేను ఆ నువ్వులు
ఓ దేవా మృత్యుదేవత ప్రతియింటను నిరంకుశంగా
ఒప్పుగా రాజ్యమేలుచు సత్యమై నిత్యమైయున్నది
ఓ బుద్ధదేవా ననుక్షమించి ఆదరింపుము తండ్రీ 313

"బ్రతికి నన్నాళ్లు చావుపుట్టుకలిలలో తప్పవు సుమ్మీ
భ్రమయే యీ శరీరంబు మోహంబీ సంతానంబు
జరామరణ వ్యాధులు దుఃఖబాధలు సహజంబె
జనులందరు తెలిసినా ఇది మరచుచున్నారదేమిటో
జయింపుమా శోకతాపంబుల జ్ఞానంబు తెలిసి
చనుము శాశ్విత శాంతితో జీవించుమో కుమారీ" 314

బుద్ధదేవుడు తెల్పిన సంసారి - సన్యాసిని గురించిన విధము

సంసారికైన సన్యాసికైన జీవిత ధర్మంబొక్కటే
సత్యమార్గంబు తెలియుటే చాలు
అహంకారము హృదయంబులో నుండనీయకు
అగుపడువేషంబు లభ్యంతరములుకావు
శాంతచిత్తము భయరాహిత్యము బడయుటేచాలు
శాశ్వితానంద జీవనుడై మనుటయే తెలియవలయు 315

శ్రీ బుద్ధదేవుని నూతన సత్యధర్మ ప్రచారము

బుద్ధ చంద్రుని యశోకాంతులు వ్యాపించె దశదిశలు
బుద్ధి తెచ్చుకొని రానాటి ప్రజానేతలు రాజులు
బహుదూరదేశాలనుండి జనులు తండోపతండాలుగా
బ్రాహ్మణాది జనులా ప్రబోధంబువిని ధన్యులై మేల్కాంచిరి
భయభ్రాంతులనెడి సంసారసారంబు తెలిసి శిష్యులైరి 316

నదీకాశ్యప, గయాకాశ్యపులను ఉరుబిల్వ ఉద్దండయోగులు
మదినెంతయో యోచించి తర్కించి పండితులెందరో
నఖశిఖ పర్యంత మెంతయో పరీక్షించి వీక్షించి
అఖిలత్త్వ భావసంపన్న సత్యధర్మ ప్రబోధంబుగాంచి
అఖండదేదీప్యమున వెలుంగు ముఖారవింద
అమ్మహాత్ముని బోధిసత్త్వునిచేరి కీర్తించిరెంతయో
ఆ మహాత్ముని శిష్యులైచేరి ధన్యులైరహో 317

మహాత్ముడు బుద్ధుడు అటునుండి రాజగృహ ప్రాంతము చేర
మహరాజు బింబిసారుడు ఆనాటి రాకుమారుం డేతెంచె నని
మహదానంద భరితుడై యేతెంచి ఆయన ముఖారవిందము గని
మహామహితాత్ముడని గ్రహించి పాదంబుల వ్రాలె
ముకుళిత హస్తములతో భక్తి భావంబుతో 318

## శిష్యులకు చేసిన ఆనతి



నాయనలార సమస్త పాపకార్యములను పరిత్యజించుడు
నా ప్రియభ్రాతలార శుభకార్యముల సంపాదన చేయుడోయి
నా సోదరులార అంతఃకరణమును శుద్ధిగానుంచుడు
నా భిక్షువులార స్వప్రాణములనైన పరిత్యజించుడోయి
అభిముఖ ప్రేమదయామయులై రోగ జీవులకావుడోయి
ఓ భిక్షువులార ప్రాణులవ్వి యొకదానికొకటి
ఓర్పుగ భయద్వేషంబులులేక మనునట్లు చూడుడు
ఓ భ్రాతలార ఆశామోహాగ్నిలో జనులు పడకుండ
సౌభాగ్యశాంతముతో జీవింప బోధింపుడనియె 319

*ఎందరో వారి వారి వెనుకటి మత ధర్మంబులుమాని
ఎరింగిరి నూతన ధర్మబోధ మహత్మ్యంబు
వెంబడించిరి బుద్ధమహాత్ముడు సాక్షాత్తు
వేదవిభుడైన భగవంతుడేయని
సమస్త పాపచర్యలను వీడి నడచిరి
సత్యధర్మ ప్రకాశజ్ఞాన మార్గంబులో 320

దూషణంబుల ఆనందంబుతో వినుడు
దుర్నీతితోగాక అభివందనములతో శ్రద్ధతో విని
ధర్మాధర్మ చైతన్య జ్ఞానాంచిత చిత్తులై
ధర్మ సత్యమార్గమవలంభించుడు తప్పకుండ 321

ఎవరు భోగలాలసాలు శాశ్వతంబని నమ్మిన
ఎంతటివారైన వారు ధన్యులుకాలేరు
ఎవరు సత్యధర్మ ప్రేమలను పాటింతురో
ధన్యులువారె సుమ్మి ధరణిలోన 322

ధన్యులు వారె సర్వప్రాణుల ప్రేమించిన
ధన్యులు కాలేరు కర్మ బంధముల చిక్కువారు
గృహములో వర్షము నీరుజల్లు పడుచుండ
గృహంబులో జనులు నివసించలేనట్లు
విషయవాసనలతో యున్నవాడు ధన్యుడు కాలేడుసుమీ
విఫల దుర్బలుడై వ్యాధిగ్రస్థుడౌనువాడు 323

ఎవరు దుష్క్రియలలో మునిగియుందురో
ఎవరు పశ్చాత్తాపముతో తప్పుల గ్రహింపరో
ఎవరు కామ క్రోధ లోభ మోహాదులతో యుందురో
ఎట్లు వారు ధన్యులౌదురు ఇహపరంబులో?
ఎరుంగుడు వారు నశింతురు పలు బాధలతో 324

ఇల్లు క్షేత్రంబుల స్వయంబుగ వీడివచ్చినగాని
ఇటు పురుషార్థహీనుడై అటు నిరుద్యోగియై
ఇటు మందుడై అటు విలాస ప్రియుడైనగాని
ఇటు భిక్షువుకైనను అహంకార మాలిన్యంబులుండ
ఇందెందును కల్యాణంబుండనేరదు సుమ్మి 325

సత్య కల్యాణంబైన నాయీ
సత్య నూతన ధర్మంబును
కష్టనష్టముల మరియు శ్రమమయ మనక
కర్తవ్యంబుగా సంసారులకు బోధించుము
దేశదేశంబుల గ్రామగ్రామాల యందును
ధర్మోపదేశ వాక్యధ్వనిని ప్రతిధ్వనింప 326

భోగదాసత్వంబులవీడి నిత్యస్వేచ్ఛతోడ
భక్తి జ్ఞానంబుతో అమృతత్త్వంబును పొంద
నిస్పందదేహముతో జనులు స్వీకరించగ
నిర్వాణ ప్రాప్తిమార్గంబుతెల్పుడో మాన్యులార 327

నాయనలార సమస్త పాపాల పరిత్యజించి
'నా' అను అహంకారంబు వీడి
శుభకార్యాచరణ సంపాదనతో
శుద్ధమైన అంతఃకరణతో
స్వకీయ జీవితాలు అశాశ్వితంబులని
సర్వజీవులపై దయామయులై మెలంగుడి
హింసా మానసంబుల వీడి
హృదయ ప్రేమ దయామయులై
ద్వేషరహితులై బాధారహితులై
ధర్మభావభరితులై నిర్వాణపథ గీతంబులపాడి
నిజజీవిత ధర్మమార్గంబైయున్న
నిజ నిర్వాణ గీతంబుల గానంబు మరిమరి చేయుడు
నిజమానసానంద సౌభాగ్యంబుతో 328

ఒకనాడొక కొండగుహలో జరిగిన భిక్షువుల సమావేశంలో బుద్ధుని బోధ



శుభప్రదంబగు చర్యలు చేయుచు సద్బుద్ధితో
శోభిల్లువారె బుద్ధాను శాసన బద్ధులు
నాయనలారా నన్ను వ్యతిరేకించి వ్యర్థంపుమాటల
నన్నాడిపోసినగాని అసూయతో వ్యతిరేకించినగాని
దూషణల నానందముతో వినుడు చింతపడక
దూషణ వ్యర్థపుమాట లభివందనముతో స్వీకరించుడు
పడకుడు బాధల శాంతముతో వినుడు
పరిశీలింపుడు తర్కముతో వారి కువిమర్శలన్ని ఓ భిక్షువులార 329

పూర్వపు జీవనపథ మందెవరుండినా
పుణ్యకర్మంబు లాచరింపుడో మాన్యులార
వాణిజ్య వ్యవసాయంబులైనా చేయవచ్చు
విడనాడవలదు దాంపత్యాదయయు ధర్మంబు
అన్యుల ఆదరింపుడు ద్వేష క్రోధంబులమాని
ఆనంద శాంత చిత్తంబుతో జీవుల నాదరించుడు
అదియె నా నూతన ధర్మప్రబోధంబు పూజ్యులార 330

సకల కర్మల నాచరింపుచు
సకల జీవులపై ప్రేమ ధర్మంబుల నిలిపి
ధనధాన్యాదులున్నను
ధనోన్మాదరహితులై మసలవలె
పరమానంద భరితులై తృప్తిచెంద
పరమ కల్యాణ మపుడె శాంతి ప్రాప్తించుసుమ్మి 331

గారడీ విద్యతో జనాన్ని ఆకర్షించుచున్నాడను కొందరికి జవాబుగా
శిష్యులకిట్లు బుద్ధదేవుడు తెల్పెను



ఇతర మతావలంబులు కొందరు కోపతాప అసూయలతో
ఇదేమి జ్ఞానము సమ్మోహనా విద్య పటిమచే
ఈ మీ బుద్ధుడు జనుల నాకర్షించు గారడియయ్యో
ఈ బోధ మీకు సద్గతికి గాదది దుర్గతికి సుమ్మి యనగ 332

"నాయనలారా వారి వ్యర్థపు మాటలకు శాంతింపుడు
నన్నేవిధంబున వా రసూయతో
నిందించినగాని వ్యతిరేకించినగాని
చింతలో పడకుడి బాధపడకుడి
శాంతముతో దూషణల వినుడు మీరు
సత్యధర్మాలే మిమ్ము రక్షించు ప్రియ శిష్యులారా" 333

శ్రావస్తి ప్రాంతమందెందరో దేవుని
శ్రేష్ఠమైన విహారాల నిర్మింపవేడి నిర్మించిరి
శ్రీకరమ్ముగ నా దేవుని ఆరాధించి వేడిరి
శ్రితజనోద్ధరణకై ఆహ్వానించిరా జనపదంబుచేర 334

## తండ్రి శుద్ధోధనుడు ఒక దూతను పంపుట

అటునుండి రాజగృహ ప్రాంతముచేర మహాత్ముడు
పటు తరంబున నొక దూత తండ్రినుండి వచ్చి
"మటుమాయ మగుచున్నది వయస్సు నాకు
కటువులేదు జరా భారముచే నాకు
తటాలున యెపుడు యీ ప్రాణంబు పోవునో నాకు
ఇటకురమ్ము నిన్ను చూడ మనసాయె నాకు
పాటుగా నీ బోధవిన నిచటివారు తపించుచున్నారు
దీటులేదు నీకంటె ఎందును మాకు
పట్టున రమ్ము మమ్ము కావుము తండ్రీ" 335

## బుద్ధుడు కపిలవస్తుపురికి వచ్చుట

దూతనుండి యా పలుకులవిని తండ్రిమాట మీరక
దబ్బున శిష్యసమేతుడై పయనించి వచ్చె కపిలవస్తుపురికి
దీక్షితుడై సప్తవర్షంబులు దాటగ వచ్చెనాటికి
దిగలేదు రాజనగరులో విడిది నొప్పగ లేదాహ్వానించినగాని
దిగెనొక పుష్పోద్యానవనంబులో వాసంబుచేయ 336

సంసారంబు పరిత్యజించి ఏడు వత్సరంబులయ్యె
సంసారధర్మ స్వీకారము చేయుము తండ్రీయన
"బాబా మీ హృదయంబు నా మీదున్న మక్కువచే
బాధపడుచున్నారు మీరు కాని అదే భావంబు
బాధలందున్న జనులు మరియు ప్రాణులన్నింటిపై
బహుప్రేమా దయాంతఃకరుణతో నుండిన
నా మీదున్న యా శోకతప్త భావంబు సడలిపోయి
నీవు నిర్వాణపథంబుచేర నిక్కువంబై
నీవు శాశ్వతానంద డోలికల నూగెదవు తండ్రీ" 337

కుమారా నీకు సామ్రాజ్యకాంక్ష తృణప్రాయంబై
కష్టనష్టము లానందంబుజేసి విలాసంబులవీడి
కఠోర సంసార నిష్క్రమణ చేసితివి తండ్రీ
కల్యాణ పథంబైన నిర్వాణ పథమన్వేషించి
కుమారా ముక్తిముంగిట మసలుచున్నావు
కోరి యీ పాప పంకిల సంసారంబు
కట్టుకుందువె యీ భ్రమాన్విత భావనసారంబు 338

ఉదయమే భిక్షాటనం చేయుచుండ శుద్ధోధనుడుచూచి

నాయనా! రాకుమారుండవై
నీవు యిందు భిక్షాటనముచేయ
మానాభిమానముల విడనాడి యేల
మా ముందరనే యాచింతువు పలువురుచూడ
భూపాలుడనైయుండ నేను చూడనగునా
భిక్షాటనముమాని రమ్ము మన నగరికి నాయనా 339

తండ్రీ భిక్షాటనమే మావంటి సాధువుల కర్తవ్యంబు
తండ్రీ భిక్షాటనమేమేలు పారంపర్యంత మీభువిలో
భూపాలా నీవు నీ జనకుండు నీ పితామహుండు
భువిపై రాజవంశంబున జన్మించి యుండవచ్చు
నేను మాత్రం రాజ వంశంబున జనించి యుండలేదు
నిశ్చల బుద్ధుల వంశంబునందు జనించినాడ
బుద్ధులు స్వఉదర పోషనార్థమై
భిక్షము తోడనె జీవింతురయ్యా 340

## శుద్ధోధనుడు తన ధన భాండాగారము సర్వస్వము తీసుకొనుమన బుద్ధుడిట్లు తెల్పెను



మీ ధన భాండాగారము నా కర్పించిన
మిగిల్చికొనక యెల్లరికి పంచివేతు
పితృఋణంబు తీర నను బంధవిముక్తునిచేయ
పుత్రవాత్సల్యంబువీడి నను దీవించుమనియె
పరమానంద మృదుమధుర అంజలి ఘటించి 341

నిజదార యశోధర భర్త తనచెంతకు రానిదె
నిజముగ తాను భర్తచెంతకు చేరనని ప్రతినచేసియుండె
బుద్ధదేవుడా ప్రతిన గారవింప భూతదయా పారంగతుడై
మిథ్యాభిమానుడై యశోధర నిష్కపట ప్రేయసి యని
మందస్మిత వదనారవిందుడై యాదేవి చూడనేగె
మూగబోయిన అంతఃపురంబులో యశోధరాదేవిని 342

ఆ యశోధరాదేవి హృదయభాండంబు పగిలి
అమాంతము శోకముప్పొంగి పారలె
ఆ దేవుని పాదపద్మంబులపై ఉవ్వెత్తున పడి ప్రభూ
ఆదరింపుము అనుగ్రహింపుమీ పాపాత్మురాలను
ఆశాకిరణమైన మన యీ బాలుని చూడుమనియె 343

ప్రభూ మే మనాథలమై యిట్లు నశింపమందురా
ప్రభూ నే నేపాపంబు జేసితి యీ పాపడు చేసిన ఘోర నేరంబేమి?
మమ్మేలంగ నిక యిట యుండరామాతోడ
మే మెవరికొఱకు జీవించమందురిటు ప్రభూ
మీ వెంటనె మమ్ము రమ్మందురా ప్రభూ
మా కర్తవ్యంబేమి శెలవీయుడు మహాప్రభూ 344

"యశోధరా యేడ్వకిది పుణ్యదినంబు
యశోధరాతలంబు పావనంబగు కాలమిది
అనంత పాపాల బంధనంబునుండి భూజనులు
అంతిమంగా విముక్తిచెందు కాలమిది
అన్ని బాధల దుఃఖంబులనుండి విముక్తిచెంది
నిజజ్ఞానంబు కలిగి నిజధర్మంబు తెలిసి
నిత్యానంద సత్యజీవనంబు చేయు కాలమిది 345

ఈ జన్మంబునుండి విముక్తి పొందుటే శరణంబు
ఈ జన్మ శరీరంబు దుఃఖ కారణంబు
ఈ శరీరంబు దుఃఖ ప్రేరితంబు
ఈ జన్మయే దుఃఖనివారణోపాయ సాధనంబు
ఈ జన్మయే దుఃఖనాశన హేతువగును
ఈ జన్మతో నిర్వాణముచెంది
ఈ జన్మ యికపై లేకుండ చేసికొనుము" 346

ఆ యశోధరాదేవి ఆయన చెంతనె వొదిగియుండగ

---

పురవాసులెందరో గుంపులుగా సందోహంబునవచ్చి
పుణ్యమూర్తి యా దేవుని దర్శించి కన్నీరుకార్చుచు
పుట్టబోడిటువంటి పూజ్యుడీ ధరణిలోన
పుడమిని కాపాడ యవతరించిన మనపాలి దేవుడని
పూజాద్రవ్య విధులతో ఆబాలగోపాలమువచ్చి పూజలుచేయ 347

తల్లి సవతియైనా గౌతమీదేవి కన్నీరు మున్నీరుగా యేడ్చుచు
తమ్ము పోషించు వారెవరు తండ్రీయని యతనిపైబడ
"తపించకుమో జననీ
తరించు నీకి జన్మ జననీ" 348

గౌతమీదేవి తనయుడు నందుడును పినతండ్రి
గారాబ తనయుడు దేవదత్తుండువచ్చి ప్రణమిల్ల
గౌతమబుద్ధుడు ఆనంద భాష్పములతో ఆనందించె
గౌరవభావ ప్రేమాంచిత తన క్షౌరకర్త ఉపాలియు
పరమానంద భరితుడై పాదంబులపైబడ
పలువిధంబుల ప్రార్థించె తన శిష్యులుగా చేసికొనగ 349

అతడే పవిత్రానందుడైన శిష్యుడాయనకు
ఆ ఆనందుడే శిష్యకోటిలో ప్రథముడై
అగ్రగణ్యుడయ్యె ఆయన శిష్యులందు
ఆ ఆనందుడే బౌద్ధతత్త్వ ప్రచారక ప్రథముండు
ఆనందుడే గురుదేవుని మనోభావానుకూలంబుగ
ఆచరించి ఆదరించిన అగణిత ప్రేమికుడై
ఆచంద్రతారార్క వరప్రసాదుడైన
ఆనందుడే బౌద్ధధర్మంబు ప్రచార ప్రముఖుడయ్యె 350

ఒకదినమున రాహులుడు తండ్రిని ధనంబిమ్మని యడుగుట



కపిలవస్తు నగరంబునందొకనాడు ఒక ప్రదేశంబున
కనుచూపుమేరలో రాజప్రసాద చేరువలో
కడు ఆకలితో నాహారము తిన నాశీనుడై యున్నతరి
కరుణ ప్రేమల దయా జ్ఞానమయ బుద్ధదేవుని చెంతకు
ఆ యశోధరాదేవి సప్తవర్ష వయసుగల సుతునిగాంచి చేరబిలిచి
అల్లదుగో నచటాసీనుడైయుండు ప్రభువే
నీ జనకుండు వెళ్ళుము ఆయన ధనదీవెనలుపొంద
నీ వరుగుము రాహుల కుమారా యని తెల్పిపంపె 351

బుడిబుడి అడుగుల పరుగున రాహులుండు
బుద్ధమహాత్మునిచేరి ధనంబు తనకిమ్మని
ముద్దుల మాటల నడుగ కుమారా నావద్ద ప్రాపంచిక ధనంబు లేదు
ముక్తి యొసంగు ధనమున్నదదియే ధర్మవిత్తంబని
ముదమాఠ కరుణ ప్రేమాన్విత ఆశీర్వచనములతో దీవించె 352

బాల్యకాలమునందె రాహులుండు త్యజించె రాజ్యము
భోగానుభవాల సంసారంబు కూడ
భవనముల త్యజించి గృహహీనుడై తండ్రివోలె
భవబంధంబుల త్రెంచుకొని తండ్రి ననుసరించె 353

బుద్ధుడు శ్రావకునికి తెలిపిన సందేశము

'వాడు నన్ను తిట్టెనను ద్వేషభావంబు వలదు
వీడు నన్ను కొట్టెనను శత్రుభావంబు వలదు
వెరువకుము ద్వేషంబు ద్వేషము నంతముచేయజాలదు
వలదు ద్వేషము అందరికది నాశనకారి
వివేకంబుగ ఇంద్రియంబుల వశంబందుంచుకొని
విజ్ఞుడవై జ్ఞానివై జీవించి ధన్యుడవుగమ్ము 354

ఎవరు అన్న పానీయ భోగియై, మోహియైనచో
ఎపుడును వాడు ధన్యుడుకాలేడు సుమా
ఎపుడును సంసారులు నిత్యానందముతో
ఏ విధమైన విషయ లంపటులుగాక ధ్యానమందెవరుందురో
ఎరుంగుము వారె ధన్యులు సుమా
ఎవరు ప్రేమ శ్రద్ధానసక్తితో నుందురో వారే ధన్యులు
ఎవరు ఆరోగ్యవంతుడో వాడే ధన్యుండు 355

ఎవరు కామాగ్నికి లోనుగాక సుస్థిర శాంతముతో
ఎల్లప్పుడుండునో వాడే ధన్యుడు సుమా
ఎవరు విషయ వాసనాబద్ధుడై కాషాయాంబరధారియైనా
ఎరుంగుము కాలేడు ధన్యుడు సుమా
ఎవరు నిత్యము నిదానం సత్యాలను పాటింతురో
ఎవరు సత్యము ప్రేమల నిరంతరం పాటింతురో
ఎరుంగుము ధన్యులు వారె సుమ్మి
ఎవరు సత్యములో సత్యము అసత్యములో అసత్యమును
ఎవరు ధర్మములో ధర్మము అధర్మములో అధర్మము
ఎరుంగుదురో వారె ధన్యులీ భువిలో 356

కోసలవాసియగు అనాధపిండదు డను ధనిక శిష్యుండు
కోట్లకొలది ధనము వెచ్చించి బౌద్ధారామము నిర్మించి
కోరెను మహాత్ముని దాని ప్రారంభించ శ్రావస్తికి పిలువ
కదలివచ్చె శిష్య బృందంబుతో స్వాగతించె అశేషజనావళి 357

బోధిసత్వుడట్లు భారతదేశ పలురాష్ట్రాలలో
బోధించె తన నూతన ధర్మప్రచారంబెల్లెడల
వంగ కళింగ, మగధ, ఉత్కల కోసల మరియు కాశీ
వయోజనులంతయు ముముక్షువులైరిఆ బోధనలతో 358

వర్ధిల్లిరి శాంతి సమాధాన పరివర్తనలై జీవనులై
అర్యులు అనార్యులను రెండు తెగలా నాడుండె
అహర్నిశలా వర్గమత భేదంబుగ శత్రువులై వారుండ
ఆ మహాత్ముని నూతనధర్మ సత్యమార్గ బోధనంబువిని
ఆనాటి పండిత పామరులాదిగ సమైక్య సోదరులై
అమల విశ్వసోదర ప్రేమ భాసింప మొదలయ్యె 359

చివరగా తన శిష్యులనిట్లు సంబోధించి తెలిపె మహాత్ముడు
చిరంజీవులారా మీరు కామలాలస మనసునుండి
చివరివరకు దూరమైయుందురో వారే శ్రేష్ఠులు సుమీ
ఎంతవరకు మీరు నూతనధర్మ నిరతులై యుందురో
ఎవరును నిరుద్యోగులై యుండక శ్రమింతురో
ఎంతవరకు మీరు సత్యాన్వేషకులై యుందురో
అంతవరకు మీరు ధర్మంనుండి పతనంకాజాలరు సుమా 360

వినుడు శృంగారముతో విపత్తులు వచ్చును
వినుడు పాపచర్యల వలన భయంబు కలుగును
వినుడు భక్తిజ్ఞానంబులు వీడిన దరిద్ర బాధలు కలుగు
వినుడు కోరికల వలన మనుజులు ధూర్తులయ్యెదరు
వినుడు సత్యాసత్య పరిజ్ఞాన శూన్యుడైనవాడు
వింత కర్మబంధములచిక్కి అధముండగు 361

## మహాత్ముని అంతిమ ముఖ్యబోధ

జరాభారా క్రమణంబున బుద్ధదేవుని శరీరంబు
జిక్కి పూర్వ పటుత్వము తగ్గి వికాసములేక
శ్రావస్తినుండి గృధ్రకూట పర్వతంబుచేరి
శ్రేయంబుగ వాసంబు చేయుచుండ యొకనాడు
అజాతశత్రువు బింబిసారుని తనయుండు
ఆ మహాత్ముని ఆశీర్వాదాలు తను తమ రాజ్యంబుపై
అనంత కాలముండ ప్రార్థించిరమ్మని దూతనుబంపె 362
వృద్ధుల భక్తితో చూచుచున్నంత వరకు
బుద్ధితో స్త్రీల నాదరింపుచున్నంత వరకు
శ్రద్ధా భక్తులతో ధర్మాచరణ చేయుచున్నంత వరకు
సాధుజనుల సేవించుచున్నంత వరకు
అధములు కారెవరును ధరణిలోన
అనవరతము అభ్యుదయ శిఖరంబు నెక్కుదురు అనందమొంది 363

## ఐదు విధాలైన చేటులగురించి పాటలీపుత్రంబు చేరి యిచ్చిన మహాత్ముని సందేశం

ధర్మమార్గమునుండి భ్రష్టులై అశుభకర్మల చేసినచో
మర్మమెరుంగు డైదు విధంబుల అవమానంబులు కలుగు
సంసారములో చేటు కలిగి చెడును
సర్వశక్తులు నశించి వారిని క్రుంగదీయు
దుర్భరమగు దరిద్రము నల్దెసల నుండి పీడించు
పరికించి చూడ నిది ప్రథమ చేటుసుమా
పరదేశముల పర్యంత మా విషయంబు ప్రాకి
సమాజ మెట్టిదైనను వారిని నీచులు చోరులనబడి
సమకాలికుల ముందర తల దించి తిరుగవలసియుండు
నాల్గవదిగా మరణ కాలమందు వారి దుశ్చర్యలు

నానుచుండు మదిలో భీభత్సము తాండవమాడు
అంతరంగ మృత్యులీలతో అజ్ఞాత భయముదయించు
అయిదవదిగా మరణానంతరంకూడ
అట్టివారి చిత్తము శాంతిలేక పాపసంజనిత
అనంత దుఃఖభాజనమై భయంకర రక్కసియై
చిత్తమును ఛేదించి రక్తమును గుటగుట త్రాగునదై
చిత్రవిచిత్ర పీడనలచే భయంబు గొలుపు 364

ధర్మమార్గావలంబులకు అయిదు విధంబులకు విజయంబులు కలుగు
కర్మలు సత్కర్మ బద్ధమై వారు ప్రజా విశ్వాసముపొంది
సమర్థులై ధరణిలో నుండుటయే ప్రథమ విజయంబు
సత్కీర్తితో వారు దూరదేశములందు ప్రస్తుతింపబడి
సన్మానింపబడెదరు యిది వారి రెండవ విజయంబు
మూడవ విజయంబుగా వారి కున్నత స్థానంబు గౌరవంబు
ముమ్మారు కలుగు నెక్కడైన మరియు యెందైనగాని
మరణకాలమందైన వారికేలాంటి భయ శోకములుండక
మనోక్షోభరహితులై శాంతిశ్రీ ముఖంబునందుండు
మహిమాన్విత అయిదవ విజయంబుగా వారికి
మరణంబు తదుపరి శాశ్విత శాంతితో
మహదానందపరులై ఎల్లలోకంబులందు శుభంబు కలుగు 365

## బుద్ధదేవుడు ఆమ్రపాలి యను వేశ్య ఆతిథ్యము తీసుకున్న విధము



పాటలీపుత్రమునుండి మహాత్ముడు కోటియను గ్రామముచేరి
పాదయాత్ర చేసిన బడలికతీర విశ్రాంతి యటు తీసికొని
వైశాలి నగరంబుచేరి 'అమ్రపాలి' యను వారాంగన
వైవిధ్యంబులేక ఆహ్వానించె తన వుద్యానవనంబుచేర
భక్తిపూర్వకంగా దేవుని సన్నిధిచేరి మ్రొక్కి అమ్రపాలి
భయభక్తులతో తన గృహంబుచేరి విందారగించమని

పతితయై కోరనా స్త్రీ పురుషు లందరామెను నీచంగా చూచినా
పరమాత్ముఁడు బుద్ధుడామె కోరికను ఆనందించి మన్నించె
బుద్ధమహాత్ముని ఆగమన వృత్తాంతంబు తెలిసి
భూరిమయాంగద విందు వినోదముల యా మహాత్ముని
పరవశింపచేయు నేర్పాట్లుచేయ లిచ్ఛవీ రాజవంశీయులు
పరిపరివిధంబుల వారి యాతిథ్యంబును స్వీకరింప వేడగ
అనాధులకు శిక్షణ యొసంగుటయే దీక్షగాయున్న
ఆ మహాత్ముఁడు హెచ్చుతగ్గుల పాటించక
ఆ లిచ్ఛవీ రాజుల అహ్వానంబులెల్ల తిరస్కరించె
అధికులగు తమను తిరస్కరించి భ్రష్టయగు
ఆ వేశ్య ఆమ్రపాలింట విందారగించ సిద్ధపడిన
ఆ మహాత్ముని చూచి వెడలిరి విషాదాంత చిత్తులై
ఆ ఆమ్రపాలి బుద్ధదేవుని పాదంబులపై వ్రాలి
అమందానందభరితయై తన్ను క్షమింపుమని వేడె
ఆ బుద్ధదేవుని సత్యధర్మ దీక్షనుపూని పవిత్రయై జీవించె
బుద్ధికలిగి యా దివ్య బోధామృతంబు గ్రోలి 366

అనంతరమా మహాత్మునికి యెనుబది వత్సరంబులయ్యె
ఆయన శరీర ధార్ఢ్యము తరిగి శుష్కించిపోయె
ఆయన ప్రధాన శిష్యులు సారీపుత్రుడు మోద్గలాయనుండు
అప్పటికే అమరులైయుండ యెందరో
అవసాన కాలంబందుండి గురువును చేరి
ఆనందజీవులై సత్యధర్మ ప్రకాశ సంఘంబుకై
అహరహము కృషి గొప్ప దీక్షతో చేయుచుండ 367

### శిష్యుడు ఆనందుని సందేహము – దేవుని జవాబు



మహాత్మా మహా భయంకర వ్యాధితో మీరుండ
మదీయ మానస సంక్షోభంబేమన యీ సంఘంబు
శాశ్వితంబుగా వర్ధిల్ల యేదైన నొక ఉపాయంబు
శాసించుము మాకు మీ యనంతరంబు మా గతియేమి? 368

'ఆనందా! బిడ్డా! నే నెపుడందరికన్న అధికుడననిగాని
అందరికి అధినాయకుండననిగాని లేదు నాకు తలంపు
అట్టి భావముగల వారెవరో వారి నీ సంఘోద్ధరణకర్తగా
అందరిపై నొకరుండ నొక యీ సంఘ శాసన
ఆచరణకై నిబంధనా సంఘ ప్రణాళికనిటు
అలరింపచేయ నాకు సమ్మతమే సుమా' 369

మరణం బాసన్నమగుచున్నది నాకు నాయనా
మీకు మీరే రక్షించుకొనుడు సత్యధర్మాల
మీ స్వంత ఆలోచనల ఆచరణంబు చేయుడు
మీరెట్టి కష్టాలలోనైన యితరుల నాశ్రయింపకుడు
మిమ్ము మీరే దేదీప్యమానంగా వెలిగించుకొనుడు
శాశ్వితంగా సత్యధర్మాలు వెలుంగు జ్యోతిని చేబట్టి
విశ్వశాంతి సౌభాగ్యంబును చేకూర్చి
విముక్తి పథంబులో పయనించుడనియె 370

ఒకనాడు దేవుడు ప్రియశిష్యుడైన ఆనందుని పిలిచి
నాకు సమీపించుచున్నది మరణంబన
ఆనందు డనంత శోకంబుతో కన్నీరు కార్చ
ఆ దేవుడు బిడ్డా ఆనందా! ఎన్నిమార్లు
ఆదేశించలేదు తప్పదు మరణంబెవరికైన యని
ఆత్మవిశ్వాస శూన్యుడవై విలపింపనేల? 371

పుట్టినవాడెపుడో ఒకప్పుడు మరణించి తీరు
పుడమిలో సంయోగ వియోగములు తప్పవు సుమా
పుట్టుట జీవించుట గిట్టుట యీ మూడును
పూర్ణంబుగ సంసార సహజ గుణంబులు తండ్రీ 372

ఇట్లు వాపోవుట నీ భ్రమాన్వితమే
ఇట్టి స్థితియందు నే నజరామరుడనై
ఇందు శాశ్వితంగా ఎట్లుండగలనోయి? 373

ఓ ప్రియ నా భిక్షులారా నేను మీ కుపదేశించిన
ఓర్పు నేర్పుతో సత్యధర్మముల స్వీకరించి
ఇట్టి ధర్మ శకటంబున కూర్చుండి
ఇట్టి సత్యసాధన గావించుడి
ఈ సద్ధర్మాన్ని సదా తిరిగి బౌద్ధధర్మ ప్రచారము చేయుడి 374

చిత్తవృత్తుల సంయమ మనెడి కళ్ళెము
చింతాకంత సడలిన స్వప్నమందైన
నిర్వాణము పొందలేరు ఓ నా భిక్షువులారా
నిజభోగ విలాసాదుల కోరకుడోయి
నిరంతర శాంతి స్థిమితంబు మది నిండియుండ
నిరీక్షణ కల్గియుండుడో శిష్యులార 375

## బుద్ధుడు తెల్పిన క్షమా గుణ విశిష్టత

క్షమా గుణంబు కల్గియుండుడో ప్రియులారా
క్షమా గుణంబె సర్వప్రమాదముల నుండి రక్షించు
క్షమాగుణంబె క్షమించు కాపాడు నెట్టివారినైన
క్షమయె దయయు సత్యంబు ధర్మంబు సుమ్మి
క్షమయె క్షయంబులేక శాశ్వితుచేయు
క్షమయె అక్షయంబగును ఇహపరంబులందు 376

క్షమకు మించిన గుణంబులేదీ జగాన
క్షమయె సర్వమానవ రక్షణంబు
క్షమయె నిఖిల జగంబును శాంతింపచేయు
క్షమయె విశ్వశాంతినిచ్చి రక్షించు సుమ్మి
క్షమయె రక్షించు అక్షయంబై అన్ని యుగాలందు 377

శుభా శుభంబుల గ్రహంబు తెల్పునని యెరుంగుడు
శుభాశుభంబులు జ్యోతిష్యమునందు తెలియవు
తెలియదు హస్తరేఖాదులందు భవిష్యద్వర్తనంబు
తెలియుము నమ్ముడు గణితమ్ము మాత్రమె 378

బుద్ధమహాత్ముడు వైశాలి నగరంబునుండి శిష్యసమేతుడై
బౌద్ధధర్మ ప్రచారము చేయుచు నొక గ్రామంబుచేర
చందుడను లోహకారుడు మహాత్ముని పాదపద్మంబుల
చుంబించి పాదధూలి నెత్తిన నిడికొని ఆహ్వానించె
తనయింట భోజనంబుచేయ శిష్య సమేతంబుగ
తదుపరి విందారగింప బుద్ధుడు చనియె
విందు భోజనము బలమైన యాహారమై
వృద్ధాప్య మహాత్మునికది జీర్ణంబుగాక అజీర్ణమై
వ్యధచెంది కుశీ నగరంబుచేర బయల్వెడలె అందుండి 379

## ధ్యాన మాహాత్మ్యము



మార్గమధ్యంబున మహాత్ముడు ఆయాసపడి
మది కడు బాధనొంది ఆనందుని తన దుప్పటి నొక చెట్టు
మొదలు సమీపంబున పరచుమని అందు విశ్రమించె
మరియొక సాధు శిష్యుడు పుక్కసుడనువాడు తన
మహనీయ గురువు ధ్యానంబు నుండ యెట్టి శబ్దంబు
మ్రోగిన గాని ధ్యాన భంగంబుగాక స్మృతియే రాదని
మహాత్ముని బుద్ధుని సమీపించి తెలిపె 380

మహాత్ముడంత తానొకపరి ధ్యానంబు నందుండ
మహా పెనుగాలి వీచెనుగాని తనని తాకలేదనియె
మరియు కుంభవర్షము కురిసినను కుదుపలేదు నన్ను
మేఘ మెరుపు లురుములు నాకు వినబడలేదు
మడిసెనా గాలి వాన తాకిడికి రెండెద్దులు
మరణించిరి యిద్దరు వ్యవసాయదారులు కూడ
కాని నేను చూడలేదు చెప్పుకొనుచుండిరి
కృషీవలురు గుమికూడి తర్వాత నా యెదుట 381

## మహాత్ముని అంతిమయాత్ర



నా నిర్వాణ సమయంబు నేటి తుది ఘడియ సుమ్మి
నా మరణ శుభఘడియ నావరింపుచున్నదోయి
నేను మరణించినంతనె సమస్త బౌద్ధులను
నడపించు శక్తి నశించునేమో యని భయమొందకుడోయి
నేను మీకు తెల్పిన సత్యధర్మ శిక్షయే మిమ్ము కాచుచుండు
నాచే మీ కుపదేశించిన ధర్మమునందు
నా ప్రియ భిక్షువులారా యే సందేహములున్నను
నన్ను నిశ్శంకితులై ప్రశ్నింపుడని ముమ్మారడుగ
నిజప్రేమతో సందేహంబు లేవియు లేవని బదులువచ్చె 382

"నాయనలారా సంసార సంయోగమునందు
నశించు శాంతి సాభ్రాతృత్వము తెలియుడయ్యా
నిశ్చలత్వ సాధనకై ధ్యానముచేయ తెలియుడి
నిర్వాణ పథంబునందు పయనించుడోయి 383

బుద్ధుని మరువకుడు సంఘమును మరువకండి
బుద్ధుని ధర్మము మరువకుడోయి
పుణ్య సచ్చిదానంద నిర్వాణపథంబు వీడకుడోయి
పూజ్యులై జగతిలో జీవించుడోయి ధర్మబద్ధులై
మహా దివ్య ముఖారవిందకాంతితో ఇట్లు పలికె

'బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి' యన 384

ప్రశాంత నిశ్శబ్దంబెల్లెడల వ్యాపించె
ప్రశాంత జ్యోతియై మహాత్ముని ముఖారవిందంబు వెలిగె
ప్రశాంత మహా ధ్యానములోనికి మహాత్ముడు వెడలె
ప్రశాంత ప్రకాశ ముఖంబై జ్ఞానజ్యోతియయ్యె 385

అపుడు శిష్యులిట్లు వేడిరి

నమో బుద్ధాయ
నమో ధర్మాయ
నమో సంఘాయ
నమోనమః 386

మహాజగతి నిశ్శబ్దంబయ్యె
ముఖారవిందమతి తేజంబయ్యె
మహా ధ్యాన సమాధిలో లీనమయ్యె
మహా ప్రస్థాన నిర్వాణమొందె
మహితాత్ముడై విశ్వమానవ శాంతిచక్రవర్తియై 387

బుద్ధదేవునికున్న పేర్లు

శ్లో॥ †సర్వజ్ఞః సుగతో బుద్ధో ధర్మరాజ స్తథాగతః
సమంతభద్రో భగవాన్ మారజి ల్లోకజి జ్జినః
షడభిజ్ఞో దశబలోఽద్వయవాదీ వినాయకః
మునీంద్రః శ్రీఘనః శ్శాస్తా మునిః
శాక్యమునిస్తుయః
స శాక్యసింహ స్సర్వార్థసిద్ధ శ్శౌద్ధోదనిశ్చ సః
గౌతమ శ్చార్కబంధుశ్చ మాయాదేవిసుతశ్చ సః 388

మరువబోదు నిన్నిలోకంబు
మనంతరంబు లెన్ని దాటినగాని
మరువరాదు నీ శాంతిమార్గంబు
మనుజులకు మనసున్నంతకాలం
మానవుల అజ్ఞానాన్ని పారద్రోలు
మహాజ్యోతియే నీ జ్ఞాన వెలుగు
మహాత్మా బుద్ధదేవా నీ కిదే శ్రద్ధాంజలి! 389

† బుద్ధ పురాణంలోని శ్లోకం

ఆరిపోదు నీ జ్ఞానజ్యోతి
ఆచంద్ర తారార్కంబు
అవనిలో నిలిచియుండ
ఆ జ్ఞానజ్యోతియె నాటి ప్రపంచశాంతి
ఆ జ్ఞానజ్యోతియె నేటి ప్రపంచశాంతి
ఆ జ్ఞానజ్యోతియె భావి ప్రపంచశాంతి

బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి

 సంపూర్ణం. 



# ఉపసంహారం

బుద్ధ మహాత్ముని కాలానికిముందున్న సామాజిక స్థితిగతులే నేడు ఇంచు మించు సమాజంలో నెలకొని వున్నవని నేటి మనుజులను పరిశీలించిన స్పష్టమగుచున్నదనుటలో సందేహము లేదు.

నేటి సమాజ ధర్మమేమిటో తెలియంగరాదు
నిజము తెలియదు అపద్ధము తెలియరాదు
పరమనిందలు వినపడు పశ్చాత్తాపము లేదు
పరులను గౌరవింపరు మరియు ప్రేమించలేరు. 1

ధనమున్నవాడె ధర్మము లేకున్నను ధర్మాత్ముడనబడు
ధనాఢ్యుడె సంఘంబునందు పెద్దయనబడు
దౌర్జన్యపరుడైతె చాలు ధనవంతుడుకూడ లొంగక తప్పదు.
ధనము దౌర్జన్యంబు లేనివాడెందును పనికిరాడు
ధనికుడు లేక దౌర్జన్యపరుడు తెల్పినదెల్ల సత్యమగును
ధరణిలో ధనహీనుండు సత్యము తెల్పిన నదసత్యంబగు 2

భక్తితోయున్నట్లు గుళ్ళుగోపురాలకు మ్రొక్కెదరు
భువిలో బుద్ధి పుట్టినట్లు పాపాల చేతురు
వారి కడ్డమొచ్చిన ఎవరినైనను సరియె
హరియింతురు హత్యలు చేసియైన 3

ఏది సత్యమొ ఏదసత్యమొ ఎరుగరాదీనాడు
ఎవరు అజ్ఞానులో జ్ఞానులెవరో తెలియదు
నంది పందియగును పంది నందియగును
ఎందుచూచిన కందుము విందు మిట్టి భువియందు 4

జార చోర మానభంగ భయంబుతో జనులు
కోరుచున్నారు భద్రత ప్రభుత్వమే వున్నదాయటంచు
ఇరుగు పొరుగువారు ఇంకేది దిక్కని వేడెదరు
మరుగు జీవనంబుతో మరిమరి దైవ ప్రార్థనంబుతో 5

బస్సుల దోచెదరు బండ్లను దోతురు
బ్యాంకుల దోచెదరు ఇండ్లను దోచెదరు
ఈ కాలంబులో సాధారణంబయ్యె యివి యెల్ల
ఈ కాలమెంత కాలంబుండునో యెరుగంగరాదు 6

బ్రహ్మజ్ఞానంబు ప్రబలియున్నట్లు
బహుస్వాముల భక్తుల మందిరాలు వెలసె
భక్తిప్రేమలతో బాధితుల నాదరించుటలేదు
శక్తి, ధనము లేనిదె చెంతకు రానియ్య రెవ్వరినైన 7

జీవహింసలేని జీవనంబు లేదు
జనుల దోచబడని రాజ్యంబు లేదు
చంపుటయో లేక చచ్చుటయె శరణంబు నేడు
చాలమంది కిట్టి తెగింపు జీవనంబులయ్యె 8

పెద్ద చిన్నలు లేవు జ్ఞానమజ్ఞానంబులు లేదు
బుద్ధి విద్య లేదు నీతి నియమంబులు లేవు
మానమర్యాద లెందును లేవు మత్సరంబులు తప్ప
మనుజు లందరిలో మానవీయత లేదు 9

తండ్రిమాట కొడుకు వినడు
తల్లితండ్రుల సాకు తనయులు కరవైరి
తమకు చెల్లెండ్రున్నట్లే యితరుల కుందురని మరతురు
తప్పులు చేయుటే మనుజుల నిత్యకృత్యంబయ్యె 10

నేడు ప్రజలే రాజులని రాజులే ప్రజలని
నేర్పుగా పాలించు కాలమొచ్చె
ప్రజల ప్రభుత్వాలివి యని
ప్రగల్భాల పాలనలో రాచరికాల
పూర్వపు పాలకులే మేలని
ప్రజలంతరాత్మలోన ప్రబలిపోయె 11

సంయోగ వియోగాలె యీ జగతికి మూలంబు
సాటి గరీబు నవాబైనట్లు నవాబు గరీబైనట్లు
అశాశ్వితంబీ దేహమై యున్నట్లే
అల్పప్రాణి యుత్తమప్రాణి యున్నట్లే
పుట్టుక చావులున్నట్లే
పూర్తి శాశ్వితంబేదియు లేనట్లే
ప్రాతదిపోయి క్రొత్తది వచ్చునట్లే
ఎవ్వడూ లేనిది నిత్యముండునట్లే
ఎపుడూ వున్నది లేనట్లే
మారుచుండుటే విశ్వ లక్షణంబేమొ
మారుటకట్లు హేతువు యేదియొకాదు 12

మానవధర్మంబు మారుచుండు
అధర్మంబు పెరిగి ధర్మంబు నశించు
అదే చివరకు ధర్మస్థాపనకై
అది కారణంబగు యిలలో సుమ్మి 13

పెద్ద చిన్న లేదు భయభక్తులు లెవెందును
పెద్దల మాటలు పిన్నలు వినరు
పిన్నలె పెద్దలవలె నటింతురు
పెద్దజ్ఞానము లేని చిన్నలంత 14
తల్లిదండ్రుల మాటలు వినరు తనయులు
తల్లిదండ్రుల కన్నము పెట్టరు తనయులు
తమ సుఖమే కోరి జీవింతురు
తామెంత ఆర్జించినా ఆశ వీడక 15

విద్యార్థులనగా విద్య నార్జించువారు
విద్యను నేడు నేర్చుటలేదు
విద్యార్జనకై చదువుట విడనాడి
విద్య నేర్చిరి వున్న పుస్తకాల చూచివ్రాయ
వుత్తీర్ణులగుచున్నారు విద్యనేర్వకున్న 16

ప్రతి మనుజుడు వాని స్వార్థంబుతో
ప్రయోజనంబులెల్ల తానొక్కడె పొందచూచు
ప్రతిఫలంబునకై వుద్యోగి చేయిజాచు
ప్రతినెల తాను జీతంబు పొందుచుకూడ 17

నాకుగాక మరొకరికి లాభంబు రాకూడదటంచు
నాకుగాక మరిన్ని లాభాలు నితరులు పొందరాదంచు
నేనే యందరికన్న యెక్కువ ధనార్జనము చేయవలెయంచు
నన్ను మించిన ధనికుడుండరాదన్న దుర్గుణ దురాశలతో
నేటి మానవు లందలమెక్కి నీల్గుచుండలేదా? 18

తనవలె యితరులున్నారన్న జ్ఞానమే సున్నయయ్యె
తనకు కానిది నితరులకుండరాదన్న ద్వేషమే
తలపింప చేయుచున్నది తన మానసంబు
తలపట్లు శిగపట్లుతో అందుకే జగంబులో
తల్లడిల్లుచున్నారు ఒకరికొకరు 19

స్వరాజ్యం సోషలిజం కమ్యూనిజంబులని
స్వదేశాలం దాయా ప్రజలు ఘోషించి
స్థాపించిరట్టి పాలనా క్రమంబుల
సాటి ప్రపంచ దేశాలందు చూడలేద? 20

రాజుల దునుమాడి పారద్రోలి
రాజులు ప్రజలందరైనట్లు ప్రజాస్వామ్యంబని
రకరకాల రీతుల పాలించబడుచు
రాజ్యంబులెల్ల అవినీతి అక్రమాలైనవని
రేగుచున్నారు జనులెల్ల యొకరిపై నొకరు 21

చరిత్ర పరికించ జరిగె మార్పులెన్నియో
పలు పరిపాలనా విధానాలు జగతినందు
పరితపించుచున్నారు నేటి దుస్థితిని గురించి
మరుగైన వెనుకపాలనే మంచిదని 22

భూతల స్వర్గమన్న సోషలిష్టు రాజ్యంబని
భువిలోని జనులుత్సాహపడి
భూవలయంబంత సామ్యవాద మాక్రమించి
భుక్తికి కొదువలేని జీవన ప్రపంచంబు కావలెనని
భూనభోంతరాళంబు దద్దరిల్లగ మ్రోగె 23

భయపడు పాలనంబయ్యె నదియని
భ్రమయయ్యె ఆశించిన నివేదనలన్నియని
ప్రజలు తెగించిచేసిరి సాహసంబు
ప్రజలు యెదిరించిరి నాటి సామ్యవాద పాలనంబు 24

ఆ పాలనలో పేదలభివృద్ధి గాంచలేదు
ఆ పాలనలో పాలించువారె వృద్ధిచెంది
ఆర్జించిరి విపరీత ధనకాంక్షతో
అందరి కండ్లుగప్పి నినాదాల ముసుగులో 25

అలమటించిరి ఆయా సామ్యవాద దేశాలలో
అభివృద్ధి శూన్యంబై ఆయుధాలభివృద్ధిచెంది
ఆకలితో ప్రజ లనుభవించి రెన్నియో యాపదల
అందలి ప్రజాస్వామ్యంబనర్థంబని గ్రహించి
అనంత ఆవేదనా ఆక్రోశంబుతో
ఆ పాలనపై ఉద్యమించి విజయులై
అంతముచెసి రందు సామ్యవాదంబు
అందరము చూడలేద యీ చిత్రంబునెల్ల 26

ధరణిలో యేదియు స్థిరంబుగాదు
దరిద్రులు ధనికులౌదురు
ధనికులు దరిద్రు లయ్యెదరు
దేశాల భవిష్యత్తు కూడ అంతయేసుమ్మి 27

నేడు నిఖిలంబు కల్తీయై
నీరు కల్తీ నూనెలు కల్తీయై
సకల తిను బండారాలు కల్తీయై
సర్వుల ఆరోగ్యంబు నశించిపోయె 28

ధనము లేకున్న విలువ లేదెవరికైన
ధనములేనివాడు దళిత సమానుడె
దగ్గఱ చుట్టాలుకూడ దరి జేర్చరెందున
ధనములేని బ్రతుకు దాస్యహీనుడేసుమ్మి 29

చేతి బాంబుల మయమయ్యె వీధులన్ని
చెల్లా చెదరిన జనజీవన భయంకర దృశ్యమయ్యె
మనుషుల దుష్కర మాయచేష్టల కంతులేక
మానుల నమ్ముటయే శ్రేయంబయ్యె
మనుజుల నమ్ముటకన్న తెలియుడోయి 30

## నేటి విద్య

నేడు బిఏలు యమ్ యేలు చదువుచున్న యువతరం
కడు మూఢులై కనలేరు తంగేడు చెట్టు మరియు
చూడలేరు వారు చొప్పదంటుకూడ
మేడిపండున్నట్లున్నదీ విద్యతీరు నేడు
సైన్సు విజ్ఞాన శాస్త్రాలు రానురాను చిత్ర
హీనులైనవి విషాదాంత జీవనంబయ్యె
నీరు కల్తీ గాలి కలుషితంబయ్యె
నీవు తిను ఆహారంబెల్ల కలుషితంబయ్యె
నీ బ్రతుకు ఆయువు ముందుకన్న నేడు క్షీణించిపోయె 31

విజ్ఞానంబు కాదు కావలసింది మానవులకు
విమల భావ ప్రేమాంచిత దయాకరుణలు కావలె నేడు
వినుడు యీసునసూయలు స్వార్థంబులు మాసిపోవ
వీరనీతి సింహుడు తెల్పిన శాంతి వెలుగునందు
వేగమె పరివర్తనచెంది నడువుడు శాంతి చక్రవర్తి బాటలోన 32

## ఆధునిక విజ్ఞానము



ఆధునిక విజ్ఞానం జ్ఞానంకాదు తెలియుడోయి
ఆత్మహత్యా సదృశ వినాశినియది మాత్రమెనోయి
అవిద్యా మానవులకది ప్రపంచ నాగరికతయైనదోయి
అత్యంత స్వార్థమయమది యీసునసూయల భావనలైనదోయి 33

మానవుడెక్కడున్నా భువిలో నేడు
మానవీయ సత్యప్రేమ దయా గుణంబులు
మరుగైపోయె యీ సునసూయలు ప్రబలె
మహా సంఘర్షనలతో యెల్లరు దిగిరి
మరెన్నో తమ తమ కోర్కెల సాధనకై 34

మనుజుడు మహనీయుడు కావలె
మనుజుని మనో ప్రవృత్తి నీచంబునుండి
మహోన్నతంగా పెరిగి పాప చర్యలు మాని
మహనీయ కరుణాంచిత దయామయులై
మనవలె మహానంద తృప్తితో 35

దుర్భరంబైన నేటి యీ సమాజగతి
దురితమైన నేటి మనుజుని చిత్తము
మరి వేగంబుగా మారకున్న
మనుజుని మనుజుడే అంతము చేసికొను
వినాశన కాలము దరిచేరు వేగంబుగ 36

కాన తిరిగి సత్యధర్మాలిందు స్థాపించుము
కాలము మించిపోక మునుపె భువిలో
కలిసి మెలిసి జనులందరు జీవించునట్లు
కరుణామయుడైన బుద్ధుని శాంతి మార్గంబులో
కరుణామయులై దయామయులై నడువుడోయి
క్రూర యీసునసూయల తృష్ణల కతీతంబుగ 37

అదియె నేటి మన కర్తవ్యమోయి
అన్నలార అక్కచెల్లెండ్లార
ఆదరించి తెలియుడు శాంతి జీవనంబుచేయ
అమల శాంతిచక్రవర్తిని సదా స్మరించుచు
అహర్నిశల ఆలకించుడో భూ జనులార! 38

బుద్ధం శరణం గచ్ఛామి !
ధర్మం శరణం గచ్ఛామి !!
సంఘం శరణం గచ్ఛామి !!!





# శాంతి చక్రవర్తి

## (శ్రీ బుద్ధ భగవానుడు)

## గేయమాల









రచయిత:

...బుళ నారాయణ రెడ్డి

వెల రు. 15-00 లు